## పవిత్రబైబులు దీనిని పేర్కొంది.

## ప్రాచీన ఆయుర్వేదం దీనిని సిఫార్సు చేసింది.

## ఆధునిక విజ్ఞానం దీనిని ఆమోదిస్తుంది.



## అలోవేరా
## సున్నితమైన చర్మంకోసం, ప్రకృతిసిద్ధమైన అద్భుత వనమూలిక.

పురాతనకాలంనుంచీ, అలోవేరా అనే అద్భుతమైన మొక్కకు, అనన్య సామాన్యమైన నివారణ శక్తిగలదనీ, చర్మాన్ని మరింత మెరుగుపరచడంలో సాటిలేనిదనీ, పేరు వుంది. చర్మాన్ని పరిపోషించడంలోనూ, టిష్యూల నిర్మాణంలోనూ, తేమ ఆరకుండా చూడ్డంలోనూ, చల్లగా వుంచడంలోనూ, పునరుజ్జీవనలోనూ, దీనికి అపారఖ్యాతి వుంది.

**భారతదేశంలో తొలిసారిగా ప్రవేశపెడుతున్నారు,**
**ఒక అద్వితీయమైన,**
**నాచురల్ బేబీ మసాజ్ ఆయిలు – 1st స్టెప్,**
**ఆలోవేరాతో పరిపుష్టమయింది.**




1st స్టెప్‌లో, అలోవేరా పరిశుద్ధసారంతోపాటు, చర్మాన్ని మరింత మెరుగుపరిచే బాదాం, మంచి గంధపు నూనెలు కూడా వున్నాయి. ప్రకృతిసిద్ధమైన ఈ పదార్థాలన్నీ కలిసి, పసిపాప కోమల చర్మాన్ని తేమగా వుంచుతాయి, చర్మాన్ని సంరక్షించి మరింత పటిష్ఠంగా చేస్తాయి. దానిని మరింత మృదువుగా, మెత్తగా, కాంతివంతంగా వుంచుతాయి. ప్రతి రోజూ మీ పాప శరీరాన్ని 1st స్టెప్‌తో మృదువుగా మాలీసు చెయ్యండి, తేడా స్వయంగా చూడండి. 1st స్టెప్ చర్మాన్ని పరిపోషించే నేచురల్ బేబీ మసాజ్ ఆయిలు – తల్లి ప్రేమలా మృదువైనది. స్వచ్ఛమైనది.



**ఇప్పుడు పుట్టివుంటే ఎంత బాగుండును అని మీకూ అనిపిస్తుంది**



3

# ...little one a cuddles?















5

























**గుర్తుంచుకోవాల్సిన పెప్సొడెంట్ సూత్రం.**

స్వీట్లు తిన్నప్పుడల్లా పళ్ళు బ్రష్ చేసుకోండి నోటిలోని క్రిములకి పెరిగే అవకాశం యివ్వకండి.




**పెప్సొడెంట్ టూత్‌పేస్ట్** సమర్థవంతంగా క్రిముల్ని దూరంచేసే టూత్‌పేస్ట్

LINTAS HLL P 18 AS 20 1813 TL

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పాదన.




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి


## విజ్ఞానాన్ని పంచుకుందాం!

చాలామంది విద్యార్థులు ఈసరికి పరీక్షలు పూర్తిచేసి వుంటారు. మరి కొందరు ఇంకా పరీక్షలు రాస్తూ వుండవచ్చు. అందరికీ సెలవులు ఆరంభ మవుతూన్న ఈ సమయంలో మనిషి జీవితంలో విద్య వహించగల మహత్తర పాత్రను గురించి కాస్త నింపాదిగా ఆలోచిద్దాం.

మనిషికి చదువెందుకు? మంచి మార్కులతో ఉత్తీర్ణులు కావడం: పట్టాలు పుచ్చుకుని తగిన ఉద్యోగాలలో స్థిరపడడం జీవితంలో చాలా అవసరం. అయితే, అంతటితో చదువుల లక్ష్యం సాంతం నెరవేరినట్టు కాదు. చదువు మనిషిలో సంస్కారాన్ని పెంచాలి. సాటి మనిషిని సరిసమానంగా భావించినప్పుడే మనిషి సంస్కారవంతుడనిపించు కుంటాడు!

సాటిమనుషులను గురించి, ముఖ్యంగా సమాజంలో మనకన్నా ఒక మెట్టు దిగువ వున్న నిరుపేదల గురించి, దీనుల గురించి పట్టించు కున్నప్పుడే మనం నిజంగా విద్యావంతులనిపించుకోగలం. మనలో చాలామంది ఎంతసేపూ సొంత గొడవలూ, లాభనష్టాలూ తప్ప పొరుగు వాళ్ళ బాధల గురించి ఏమాత్రం పట్టించుకోము. మనం చదివే చదువులు—మన చుట్టూ వున్న సమాజాన్ని అర్థం చేసుకోవడానికి దోహదం చేసేవిగానూ, సమాజం పట్ల మన బాధ్యతలను పెంచేవిగానూ, పేరుకుపోతూన్న సామాజిక రుగ్మతలను పోగొట్టడానికి మనకు స్ఫూర్తి నిచ్చేవిగానూ ఉండాలి.

మనకున్న విజ్ఞానాన్నీ, ఆనందాన్నీ పదిమందితో కలిసి పంచుకునే మంచి మనస్తత్వం మనలో పెరగాలి. అప్పుడే మనం నేర్చిన విద్యకు సార్థకత లభిస్తుంది. అటువంటి మంచి మనస్తత్వాన్ని ఈ రోజు నుంచి మనమందరం అలవరుచుకుందాం.


సంపుటి 90 ఏప్రిల్ '92 సంచిక 4

విడి ప్రతి : 4-00 నంవత్సర చందా : 48-00






# సాల్వడార్‌లో శాంతి



ఒక దేశంలో అంతర్యుద్ధం ముగిసి, శాంతి ఏర్పడడం ఎంతయినా సంతోషించతగ్గ పరిణామం. మధ్య అమెరికాలోని ఎల్ సాల్వడార్‌లో అటువంటి శాంతి పరిస్థితి ఏర్పడింది. అక్కడి మిలిటరీ ప్రభుత్వానికీ, వామపక్ష గెరిల్లాలకూ మధ్య, గత పన్నెండేళ్ళుగా అంతర్యుద్ధం జరిగింది. దాని కారణంగా 75,000 మంది ప్రాణాలు కోల్పోయారు!

దాదాపు 450 సంవత్సరాలకు పూర్వం, స్థానిక అజ్‌టెక్ ప్రజలను, స్పెయిన్ నుంచి వచ్చి స్థిరపడినవాళ్ళు జయించారు. పందొమ్మిదవ శతాబ్దారంభంలో స్పానిష్ ప్రభుత్వాన్ని కూలదోయడం పర్యవసానంగా—గొటెమాలా, హొండూరస్, నికరాగువా, కోస్టారికా మొదలైన రాష్ట్రాలు కలిసి, 1823 వ సం॥లో 'సెంట్రల్ అమెరికన్ ఫెడరేషన్' ఏర్పడింది.

ఈ ఫెడరేషన్ 15 సంవత్సరాలు మాత్రమే కొనసాగింది. ఆ తరవాత అది రద్దు కావడంతో 1838 వ సంవత్సరంలో ఎల్‌సాల్వడార్ స్వతంత్ర దేశమయింది. అక్కడి ప్రజల ప్రధాన జీవనోపాధి వ్యవసాయం. అయితే వ్యవసాయ భూములన్నీ సంపన్న కుటుంబాల ఆధీనంలోనే వుండేవి. వాళ్లు రైతులనుంచి ఎక్కువ రాబట్టుకునేవాళ్ళు.

వంద సంవత్సరాల స్వతంత్రపాలన ప్రజలలో ఎంతో మార్పును తీసుకువచ్చింది. వేలాదిమంది సాల్వడార్ ప్రజలు హొండూరస్‌కు వలస వెళ్ళి స్థిరపడసాగారు. ఇది ఉభయ దేశాల మధ్య ఉద్రిక్తతకు దారి తీసింది. 1970 వ సం॥లో జరిగిన ప్రపంచ ఫుట్‌బాల్ పోటీలలో హొండూరస్‌ను సాల్వడార్ ఓడించడంతో అది యుద్ధంగా పరిణమించింది!

1972 వ సం॥లో జనరల్ కార్లోస్ రోమిరో ప్రెసిడెంట్‌గా ఎన్నికయ్యాడు. అయినా, అతడి నియంతృత్వ పాలన అంతఃకలహాలకూ, అశాంతికీ, అలజడులకూ దారి తీసింది. అనేక గెరిల్లా బృందాలు ఏర్పడ్డాయి. అవి కిడ్నాపులకూ, హత్యలకూ పూనుకున్నాయి. 1980 వ సం॥లో రాజధాని సాన్‌సాల్వడార్ అర్క్‌బిషప్, అస్కార్ రోమిరో దారుణంగా మాత్యచేయబడ్డాడు. దాంతో అంతర్యుద్ధం ఆరంభమయింది.

అదే సంవత్సరం, జోస్ డ్యూఅర్ట్, సాల్వడార్ ప్రెసిడెంట్ అయ్యాడు. అయితే, అతడు చేసిన ఎన్నికల వాగ్దానాలయిన ఆర్థిక సంస్కరణలను ప్రవేశపెట్టలేకపోయాడు. పైగా అతడు క్యాన్సర్ వ్యాధిగ్రస్తుడయ్యాడు. దాంతో హింసాకాండ మరింత ఉధృత రూపం దాల్చింది. అతని రాజీనామా అనంతరం, 1989 వ సం॥లో ఆల్‌ఫ్రెడో క్రిస్టియానీ నూతన అధ్యక్షుడుగా ఎన్నికయ్యాడు. అతని ప్రయత్నాలఫలితంగా, ఐక్యరాజ్యసమితి శాంతి మంతనాలు ప్రారంభించి రెండేళ్ళలో సత్ఫలితాలను సాధించింది.

గత జనవరి 16 వ తేదీ సాల్వడార్ ప్రభుత్వం, వామపక్ష ఫరాబుండే మారి నేషన్ లిబరేషన్ ఫ్రంట్ (ఎఫ్. ఎమ్. ఎల్. ఎన్)తో కుదుర్చుకున్న ఒక ఒడంబడికలో సంతకం చేసింది. ఈ ఒడంబడిక ఫిబ్రవరి ఒకటవ తేదీ అమలులోకి వచ్చింది. ఈ సంతకాలు జరిగినప్పుడు, ఐక్యరాజ్యసమితి ప్రధాన కార్యదర్శి డా॥ బౌత్రోస్ ఘాలీ, "ఎల్‌సాల్వడార్‌లో సాగిన సుదీర్ఘమైన కాళరాత్రి అంతమయింది," అని తన హర్షాన్ని వ్యక్తం చేశారు.

గెరిల్లా పోరాటాల విరమణ, సైనిక దళాల తగ్గింపు, భూ సంస్కరణల అమలు, న్యాయపరిపాలన, ఎన్నికల విధానంలో మార్పులు మొదలైనవి ఆ ఒడంబడికలోని ప్రధాన అంశాలు.

తిరుగుబాటుదారులు మెక్సికో నుంచి స్వదేశానికి వచ్చినప్పుడు, దేశ నాయకులు వాళ్ళకు, "మన దేశ ప్రజలు" అని ఉత్సాహంగా స్వాగతం పలికారు!





# నిర్వాసుడి మోక్షప్రాప్తి

ఒకానొకప్పుడు దుర్గమారణ్యంలో, నిర్వాసుడనే కోపిష్టి ముని వుండేవాడు. ఎవరి వల్లనైనా చిన్న తప్పు జరిగితే చాలు, వెనకాముందూ చూడకుండా పెద్ద శాపమివ్వడం ఆయన అలవాటు.

ఆ విధంగా ఒకసారి సుదీపుడనే రాజుపై ఆగ్రహించి, రాక్షసుడివి కమ్మని శపించాడు నిర్వాసుడు. సుదీపుడు రాక్షసుడై ప్రజలను బాధించసాగాడు.

సుదీపుడి మంత్రి సుకాముడు. ఆయనకు జరిగిన విషయం తెలిసింది. వెంటనే ఆయన దుర్గమారణ్యానికి వెళ్ళి నిర్వాసుణ్ణి కలుసుకుని, ''మునివర్యా! సుదీపుడు మంచి రాజు. ఆయన పాలనలో ప్రజలు సుఖంగా వుండేవారు. మీ శాపంతో సుదీపుడు రాక్షసుడై, ఇప్పుడు తన ప్రజలనే బాధిస్తున్నాడు. సుదీపుడి తప్పుకు ఇంతమంది ప్రజలను ఉసురు పెట్టడం తమకు భావ్యంకాదు. దయతలచి ఏదైనా తరుణోపాయం చెప్పండి,'' అని వేడుకున్నాడు.

నిర్వాసుడు మంత్రి వంక జాలిగా చూసి, ''ఒకానొకప్పుడు బ్రహ్మదేవుడిచ్చిన వరాలవల్ల, ఎందరో రాక్షసులు అమిత బలవంతులై ప్రపంచాన్ని బాధించారు. అంటే, దేవుడివల్ల తప్పు జరిగిందనా? ప్రజలు తమ కర్మఫలం అనుభవించవలసి వచ్చినప్పుడు, దేవుడు రాక్షసులకు వరాలిస్తాడు; మునులు మనుషులకు శాపాలిస్తారు. ఇందులో నేను నిమిత్తమాత్రుణ్ణి. నన్నూ, నిన్నూ, అందర్నీ నడిపించేవాడు ఆ పైన వున్నాడు,'' అని చెప్పాడు.

''మునివర్యా! మీరు చెప్పింది అక్షరాలా నిజం. నా దేశ ప్రజల కర్మఫలం తీరిపోయే సమయం వచ్చిందేమో, అందుకే

జొన్నలగడ్డ రామలక్ష్మి



నేను మీ దగ్గిరకు వచ్చాను. సర్వ శక్తి మంతులైన తమరు, నాకేదైనా నివారణో పాయం సెలవిచ్చి పంపండి,'' అని సుకాముడు, నిర్వాసుణ్ణి మరీ మరీ వేడుకున్నాడు.

చివరకు నిర్వాసుడు, ''నిన్ను చూస్తే నాకు జాలికలుగుతున్నది. కాబట్టి నీకొక రహస్యం చెబుతున్నాను, విను. ఇక్కడికి ఆమడ దూరంలో కాళికాలయ మొకటి వున్నది. అందులో నిలువెత్తు కాళీ విగ్రహం సామాన్యుల గుండెలు జలదరింప చేసేటంత భయంకరంగా వుంటుంది. నీవు, ఆ విగ్రహం ముందు నిలబడి, నీ శరీరంలో నీకెక్కువగా ఇష్టమైనభాగాన్ని అర్పిస్తే, మనసులోని కోరిక తీరుతుంది. వెళ్ళు!'' అని చెప్పాడు.

సుకాముడు ఆమడ దూరం ప్రయాణం చేసి కాళికాలయం చేరుకున్నాడు. అక్కడ కాళికావిగ్రహం భయంకరంగా వున్నప్పటికీ చలించక, ''మాతా! నా దేశ ప్రభువు సుదీపుణ్ణి తిరిగి మనిషిని చెయ్యి. అందుకుగాను, నా శరీరంలో నాకెంతో ఇష్టమైన శిరస్సును నీకు సమర్పించుకుంటున్నాను,'' అంటూ ఒరలోంచి కత్తి తీసి తలను నరుక్కోబోయాడు.

అప్పుడక్కడ కనులు మిరుమిట్లు గొలిపే వెలుగు వచ్చింది. సుకాముడు చూడలేక కళ్ళు మూసుకున్నాడు. ఆ మరు క్షణం, ''మానవా! నీ దేశభక్తికి, సాహసానికి మెచ్చాను. నువ్వు వెంటనే రాజధానికి తిరిగి వెళ్ళి, అందరికీ అర్థమయ్యే విధంగా వేయి పుటల కథను వ్రాయి. ఆ కథను చదవడం మొదలు పెడితే, మధ్యలో మానాలనిపించకూడదు. అప్పుడా కథను రాజు సుదీపుడికి వినిపించు. అతడు తిరిగి మామూలు మనిషి కాగలడు,'' అన్న మాటలు సుకాముడి చెవిలో వినిపించాయి.

సుకాముడు కంగారుగా, ''మాతా! నేను రాజనీతికి సంబంధించిన ఎన్నో ఉద్గ్రంథాలు చదివాను. ప్రజోపయోగ

కరమైన విజ్ఞానం ప్రసాదించే శాస్త్రాలు అభ్యసించాను. అత్యవసర సమయంలో ఉపయోగపడుతుందని అంతో ఇంతో వైద్యం కూడా నేర్చుకున్నాను. కానీ నాకు సాహిత్యంపట్ల అభిరుచి లేదు. ఒక్కగా నొక్క మహాకావ్యం కూడా చదవలేదు. ఎవరన్నా చదువుతున్నా అది నాకు వినాలనిపించేది కాదు. నావంటి వాడివల్ల కథ వ్రాయడం వీలవుతుందా?'' అని అడిగాడు కళ్ళు మూసుకునే.

''నీకు వింటున్నకొద్దీ వినాలనిపించే లాగా కబుర్లు చెప్పడం చేతనవును కదా! అవే కబుర్లను చదివినకొద్దీ చదవాలని పించేలాగా పెద్దకథగా వ్రాయి. నీ కథను అన్ని వయసులవాళ్ళూ చదివి ఆనం దిస్తారు. ఆ కథవల్లనే నీ రాజుకు శాప విమోచన మవుతుంది. ఇది నేనిచ్చిన వరంగా భావించి, నేను చెప్పినట్లు చెయ్యి.'' అన్న మాటలు సుకాముడి చెవిలో వినిపించాయి.

సుకాముడు రాజధానికి తిరిగి వెళ్ళి, రాత్రింబవళ్ళు కష్టించి ఒక మాసం రోజుల్లో వేయిపుటల కథను వ్రాశాడు. తర్వాత ఆ గ్రంథాన్ని తీసుకుని రాజు సుదీపుణ్ణి వెతుక్కుంటూ వెళ్ళాడు.

రాక్షసరూపంలో వున్న సుదీపుడు పెద్దగా అరుస్తూ సుకాముడి మీదికి వచ్చాడు. సుకాముడు చలించకుండా తన గ్రంథాన్ని తెరిచి చదవడం ప్రారం భించాడు.





అంతే! సుదీపుడు మంత్రం వేసినట్లాగి పోయాడు.

సుకాముడు పుట తర్వాత పుటను చదువుతూంటే, సుదీపుడు శిలాప్రతిమలా నిలబడి వినసాగాడు. అలా ఏకబిగిని సుకాముడు గ్రంథాన్ని చదివాడు, సుదీపుడు విన్నాడు.

చివరిపుటలు చదివి గ్రంథాన్ని పూర్తి చేసేసరికి, సుకాముడి కళ్ళముందు రాక్షసుడు కాక రాజు సుదీపుడు ఉన్నాడు. ఆయన అప్పుడు మహా సౌందర్యంతో వెలిగిపోతూ చిరునవ్వులు చిందిస్తున్నాడు.

ఆ తర్వాత రాజూ, మంత్రీ అంతఃపురానికి వెళ్ళారు. అప్పుడు సుదీపుడు, మంత్రితో, "నువ్వు రాసిన గ్రంథం గొప్పగా వుంది. ఇలాంటివి ఇంకా ఇంకా గ్రంథాలు వ్రాసి మమ్మల్ని ఆనంద పరుచు." అన్నాడు.

దానికి మంత్రి, "మహాప్రభూ! గ్రంథ రచన నావల్లకాదు. మీకు శాపవిమోచనం కలిగించాలన్న కోరికతో ఇది వ్రాశాను. ఇక మీదట నా శక్తిని మంత్రాంగంలో తమకు సాయపడాలని మాత్రమే ఉపయోగించనివ్వండి. ఇలాంటి గ్రంథాలను వేరే ఎవ్వరిచేతనైనా వ్రాయించండి." అన్నాడు.

పరిపాలనలో తనకు మంత్రి అవసరం వున్నదని గ్రహించి, సుదీపుడు తన ఆస్థానంలోని కవి, పండితులను రప్పించి సుకాముడి గ్రంథం లాంటి గ్రంథాలు వ్రాయమని కోరాడు.

వాళ్ళందరూ ఆ గ్రంథాన్ని చదివి, రాజుతో, "మహాప్రభూ! మేమే కాదు, సరస్వతీదేవిని ఉపాసించే సాహితీవేత్తలెవ్వరూ, ఇటువంటి గ్రంథాలను వ్రాయడానికి ఒప్పుకోరు," అని చెప్పారు.

ఇది విని సుదీపుడికి కోపం వచ్చింది. ఆయన సుకాముడి గ్రంథానికి వేలకొద్దీ ప్రతులు వ్రాయించి ప్రజలకు పంచి పెట్టాడు. అంతేకాక, అలాంటి గ్రంథాలు వ్రాసినవారికి పదివేలవరహాలు కానుకగా ఇస్తానన్నాడు.

సాహితీవేత్తలెవరూ పదివేలవరహాలకు ఆశపడలేదు. కానీ కబుర్లు చెప్పడం బాగా వచ్చినవాళ్ళు మాత్రం చాలామంది ముందుకు వచ్చారు. క్రమంగా అలాంటి గ్రంథాలు చాలా తయారయ్యాయి. ప్రజలకు ఆ గ్రంథాలు చాలా నచ్చాయి. వ్రాసేవాళ్ళకవి డబ్బులు తెచ్చిపెట్టాయి. చదివేవాళ్ళకవి వినోదాన్నిస్తున్నాయి.

ఇలా కొంతకాలం జరిగేసరికి, ఆ దేశంలో కవి, పండితులకు, సాహితీవేత్తలకుఅదరణలేకుండాపోయింది.వాళ్లంతా కలిసి ఒకచోట సమావేశమై విషయం చర్చించాక—ఇటువంటి ఇబ్బంది కలగడానికి కారణం నిర్వాస మహాముని మాత్రమే చెప్పగలడని అనుకున్నారు.

"ఆ ముని మహాకోపిష్టి. ఆయన మనందర్నీ కలిపి శపిస్తే ఏం చేయాలి?" అని ఒక పండితుడు అడిగాడు.

అందుకు మిగతా పండితులు ఏకకంఠంగా, "ఈ దేశంలో వుండి పనికిరాని గ్రంథాలు చదవడం కంటే, నిర్వాస మహాముని శాపానికి గురికావడమే మేలు," అన్నారు.

వాళ్ళు సుకాముడి గ్రంథాన్ని తీసుకుని నిర్వాసమహాముని ఆశ్రమానికి వెళ్ళారు. వాళ్ళు వెళ్ళేసరికి తదేకధ్యానంతో తపస్సు చేసుకుంటున్న నిర్వాస మహామునికి, వాళ్ళ కోలాహలానికి తపోభంగమయింది. ఆయన కళ్ళు తెరిచి ప్రసన్నవదనంతో వాళ్ళవంక చూసి,



వచ్చిన కారణమడిగి తెలుసుకుని, సుకాముడి గ్రంథాన్ని తీసుకుని దివ్యశక్తితో అందులోని విశేషాన్ని క్షణాల మీద గ్రహించి, "సాహితీవేత్తలారా! మీ కారణంగా కొంతకాలం నుంచి నన్ను బాధిస్తున్న సందేహం తొలగిపోయింది. నేను మోక్షం కోసం ఎన్నో సంవత్సరాలుగా తపస్సు చేస్తున్నాను. కానీ కోపాన్ని విడిచిపెట్టలేక పోవడంవల్ల, నాకు మోక్షం సిద్ధించడం లేదు. నా కోపంతో నేను కొందరిచేత వాళ్ళ కర్మఫలం అనుభవించే విధంగా శాపాలిస్తున్నాను. కానీ కొంత కాలం నుంచి నాలో కోపం పూర్తిగా నశించిపోయింది. అందుకు కారణం, ఈ గ్రంథమేనని ఇప్పుడర్థమవుతున్నది!" అన్నాడు.

"మహామునీ! అదెలాగో కొంచెం వివరించండి," అని కోరాడొక పండితుడు.

"పండితులైన మీకు అంత వివరణ అవసరం కాదనుకుంటాను. సరే, సుకాముడు వ్రాసిన ఈ గ్రంథాన్ని చదవడం రాక్షస జన్మకంటే ఘోరమైనది. అందువల్లనే, ఏ ప్రయోజనమూలేని ఈ గ్రంథంలోని చప్పిడిమాటలు విన్న సుదీప మహారాజు రాక్షసరూపం నుంచి విముక్తుడయ్యాడు. మీ దేశ ప్రజలు తమ తమ కర్మ ఫలాన్ని అనుభవించడానికి, ఇక ముందు నా శాపాలతో అవసరం లేదు; ఇలాంటి గ్రంథాలు చదివితే చాలు! ఇక నుంచి ప్రపంచంలో మునులు, వాళ్ళ శాపాలు వుండవు—వాటిబదులు ఇలాంటి గ్రంథాలే వుంటాయి," అన్నాడు నిర్వాస మహాముని చిరునవ్వు నవ్వుతూ.

ఆ క్షణంలోనే కవి పండిత సాహితీవేత్తలందరూ చూస్తూండగా, ఆకాశం నుంచి విమానమొకటి అక్కడ దిగింది. అందులో వున్న దేవదూతలు, నిర్వాస మహామునిని ఆహ్వానించారు. ముని అక్కడ వున్నవారితో, "ఈ గ్రంథం ధర్మమా అని, నా కర్మఫలం పూర్తయి మోక్షం పొందుతున్నాను, సెలవు!" అంటూ విమానం ఎక్కాడు.






వీరగిరి రాజ్యంలో ఎక్కడ చూసినా ప్రజల ఆనంద కోలాహలం; ఎక్కడ విన్నా యువరాణి విద్యావతి జన్మదినోత్సవాల గురించే మాట! జన్మదినోత్సవాలకు ఇంకా మూడు వారాల వ్యవధి ఉన్నది. అయినా, అప్పుడే ప్రజలలో వేడుకల హడావుడి ఆరంభమయింది. యువరాణి తన బంధుమిత్రులతో కలిసి, ఆలయానికి వెళ్ళి, దేవీ దర్శనం చేసుకుని ప్రధాన వీధులగుండా రాజప్రాసాదం చేరడం— జన్మదినోత్సవంలో ప్రధాన కార్యక్రమం. అందువల్ల ఉదయం, సాయంకాలం వీధులను శుభ్రపరుస్తున్నారు. ముత్యాల ముగ్గులతో, పచ్చటి ద్వారతోరణాలతో వీధులన్నీ కళకళ లాడసాగాయి. యువరాణి దర్శన భాగ్యం ఎప్పుడు కలుగుతుందా అని ప్రజలందరూ ఆనందోత్సాహాలతో ఎదురు చూడసాగారు.

అయితే, యువరాణి జన్మదినోత్సవానికి మూడు రోజుల ముందు, రాజభటులు చేసిన చాటింపు విని వీరగిరి ప్రజలు దిగ్భ్రాంతులయ్యారు. యువరాణి హఠాత్తుగా వ్యాధిగ్రస్తురాలు కావడం వల్ల జన్మదినోత్సవాలు రద్దు చేస్తున్నామని రాజు ప్రకటించడంతో ప్రజలు ఆశాభంగానికి గురయ్యారు.

ప్రజలలాగే, వీరపురి రాజు వీరసేనుడూ, రాణి వజ్రేశ్వరీదేవీ తమ ఏకైక కుమార్తె విద్యావతి పరిస్థితిని చూసి విచారగ్రస్తులయ్యారు. ఇంతకు పూర్వం



దానిలా కదలా మెదలక వున్న తన కుమార్తెను చూడగానే రాణి కడుపు తరుక్కుపోయింది. రాజు కూడా తన కుమార్తెను చూసి ఒక్క క్షణం నిర్విణ్ణుడయ్యాడు. రాజవైద్యుణ్ణి పిలిపించాడు. వైద్యుడు యువరాణి నాడి పరీక్షచేసి, చూశాడు. అతనికి ఆమె శరీరంలో ఎలాంటి వ్యాధి లక్షణాలూ కనిపించలేదు. అయినా, ఆమె పడకపై నుంచి లేవలేక పోతున్నది. వ్యాధి కారణం అంతుబట్టక, రాజవైద్యుడు రాజుతో, "ప్రభూ, యువరాణికి ఇప్పుడు ఎలాంటి మందులూ వద్దు. రెండు మూడు రోజులు పరిశీలించి చూసి, అ తరవాత ఔషధ చికిత్స ప్రారంభిద్దాం. అంతవరకు ఆమెకు విశ్రాంతి అవసరం," అన్నాడు.

ఎప్పుడు గాని విద్యావతి స్వల్ప అనారోగ్యానికి సైతం గురైనది లేదు. అలాంటిది మూడు రోజులక్రితం ఆమె ఉదయం పడకనుంచి లేవలేక పోయింది. పరిచారిక శాలిని ఆమెను లేపి కూర్చోబెట్టడానికి ప్రయత్నించింది. విద్యావతి అతి కష్టం మీద లేచి నిలబడిందిగాని, మరుక్షణమే తూలి పడక మీద పడిపోయింది. అంతే, అప్పటి నుంచి ఆమె అలాగే నీరసంగా పడివున్నది!

విషయం తెలియగానే రాణి వజ్రేశ్వరీ దేవి, విద్యావతి శయన మందిరానికి వచ్చింది. ముఖం పాలిపోయి, ఎన్నాళ్ళ నుంచో దీర్ఘవ్యాధితో బాధపడుతూన్న

రాజు సరేనని తల పంకించాడు.

రాణివజ్రేశ్వరీదేవి, ఆ రోజంతా యువరాణి పక్కనే కూర్చున్నది. విద్యావతి ప్రశాంతంగా నిద్రపోయింది. సాయంకాలం రాజవైద్యుడు వచ్చినప్పుడు కళ్ళు తెరిచి, "ఇంకా నీరసంగానే ఉన్నది. ఆకలి లేదు!" అన్నది.

రాజవైద్యుడు ఆమెకు పళ్ళరసం మాత్రం ఇవ్వమన్నాడు.

రెండవ రోజు కూడా మొదటి రోజు లాగే గడిచింది. ఆ రోజు రాత్రి రాణికి ఒక వింత



అనుభూతి కలిగింది. ఆమె కళ్ళు మూసుకుని పడుకుని వుండగా హఠాత్తుగా చల్లటి స్పర్శ ఏదో తగిలి కళ్ళు తెరిచింది. తెల్లటి దయ్యం లాంటి ఆకారం ఒకటి గది నుంచి బయటకు వెళ్ళడం ఆమెకు లీలగా కనిపించింది. అయినా దాని ముఖం స్పష్టంగా కనిపించలేదు. అది ఆడా, మగా అన్న సంగతి కూడా తెలియలేదు. ఒకవేళ కిటికీ నుంచి పడుతూన్న వెన్నెల కిరణాలను తను దయ్యంగా భ్రమపడ్డానేమో అనుకుని రాణి పడుకుని కళ్ళు మూసుకుంది. కొంతసేపటి తరవాత మళ్ళీ అదే స్పర్శ. రాణి ఉలిక్కిపడి లేచింది. దయ్యమూ లేదు; వెన్నెల కిరణాలూ లేవు. నిద్రపోతూన్న రాజును లేపి సంగతి చెప్పింది. అంతా విన్న రాజు, "దేవీ, విద్యావతి పరిస్థితి గురించి ఆలోచిస్తూ పడుకుని వుంటావు. ఏదో కల వచ్చింది, అంతే. మన అమ్మాయికి ఎటువంటి ఆపదా రాదు. నిశ్చింతగా నిద్రపో," అని రాణిని ఓదార్చాడు.

మూడవ రోజు తెల్లవారగానే రాజవైద్యుడు వచ్చాడు. విద్యావతి ఆరోగ్యంలో ఎలాంటి మార్పూ కనిపించలేదు. ఆమెను పరిశీలించి చూసి, వైద్యుడు, మూడు పూటలా సేవించడానికి కొన్ని బలవర్థక ఔషధాలు ఇచ్చి వెళ్ళాడు.

రాజు, ఆ రోజు సాయంకాలం, యువరాణి అనారోగ్య కారణంగా, ఆమె జన్మదినోత్సవాలను రద్దు చేస్తున్నట్టు చాటింపు చేయించాడు. పదహారు సంవత్సరాలుగా ఇంతవరకు ఇలా ఎప్పుడూ జరగలేదు. యేటా యువరాణి దేవాలయానికి వెళ్ళేప్పుడు, రాజవీధిలో దారికి ఇరువైపులా బారులుతీరి నిలబడి, ఆనందోత్సాహాలతో ఆమెకు శుభాకాంక్షలు తెలియజేసేవారు ప్రజలు. ఈ యేడు వేడుకలు లేవనగానే, యువరాణికి ఏమయిందోనని కలవరపడసాగారు. రాజవీధిలో అక్కడక్కడ గుంపులు గుంపులుగా చేరి, తమలో తాము చర్చించుకోసాగారు. మరి



కొందరు రాజప్రాసాదం ముందు గుమి గూడి, భవనం లోపలి నుంచి వెలుపలికి వచ్చే భటులను అడిగి యువరాణి పరిస్థితిని ఎప్పటికప్పుడు తెలుసుకోసాగారు!

యువరాణి జన్మదినానికి ఒక్క రోజు ముందు, రాజభటుడొకడు రాజప్రాసాదం నుంచి వెలుపలికి వచ్చి, అక్కడ గుమి గూడిన ప్రజలకు, "ప్రస్తుతం యువరాణి ఆరోగ్యం కొంత మెరుగయింది. ఆమె మెల్లగా లేచి కూర్చోగలుగుతున్నారు. రేపు యువరాణి జన్మదినం సందర్భంగా దేవాలయాలన్నిటా ప్రత్యేక పూజలు జరిపించమని రాజుగారు ఆజ్ఞాపించారు. ప్రధాన జ్యోతిషాచార్యుడు వాచస్పతిని సంప్రదించడానికి రాజుగారు స్వయంగా బయలుదేరి ఆయన వద్దకు వెళ్ళారు!" అని తెలయజేశాడు.

ఆ వార్త విని ప్రజలు కాస్త ఊరట చెంది, ఇళ్ళకు వెళ్ళారు. మరునాడు వేకువజామునే ప్రజలు దేవాలయాలకు వెళ్ళి, యువరాణి అనారోగ్యం నుంచి త్వరగా కోలుకోవాలనీ, ఆయురారోగ్యాలతో ఆమె చిరకాలం వర్థిల్లాలనీ ప్రార్థనలు జరిపారు.

ప్రధాన జ్యోతిషాచార్యుడు వాచస్పతి, రాజువెంట రాజభవనానికి వచ్చి, యువరాణి జాతకాన్ని కొంతసేపు ఏకాగ్రచిత్తంతో పరిశీలించి చూసి, "మహారాజా! యువరాణి జన్మించినప్పుడే, ఆమె జాతకాన్ని గణించి, ఆమెకు పదహారో యేట ఒక గండం వుందని చెప్పాను, కదా?" అన్నాడు.

"మాకది జ్ఞాపకం లేదు, ఆచార్యా! విద్యావతి శిశుప్రాయం నుంచి, ఎటువంటి అనారోగ్యానికీ గురికాలేదు. ఎంతో ఆనందంగా కనిపించేది. ఆమెకు ఇలాంటి పరిస్థితి ఏర్పడగలదని ఊహించడానికి సైతం మాకు అనుమానం కలగలేదు. ఇప్పుడు కూడా ఆమెను పరిశీలించిన రాజవైద్యుడు ఆమెలో ఎలాంటి వ్యాధి లక్షణాలూ కనిపించడంలేదన్నాడు. మరెందు

కీమె నీరసించిపోయిందో అంతుబట్టడం లేదు!" అన్నాడు రాజు విచారంగా.

పక్కనే వున్న రాణి వజ్రేశ్వరీదేవి, "ఈ రోజు విద్యావతి పుట్టినరోజు. యేటా ఆమె జన్మదిన వేడుకలను ఘనంగా జరపడం ఆనవాయితీ. అది మన దేశ ప్రజలకెంతో ఆనందకరమైన విషయం. విద్యావతి సంపూర్ణ ఆరోగ్యంతో మామూలు మనిషి కాగలదా, ఆచార్యా!" అని అడిగింది ఎంతో ఆదుర్దాగా.

వాచస్పతి మళ్ళీ తదేక దీక్షతో విద్యావతి జాతకచక్రాన్ని పరిశీలించసాగాడు. కొంతసేపు మౌనంగా ఆలోచించి, తల పైకెత్తి, "యువరాణి జాతకం ప్రకారం ఒక సంవత్సరం నుంచే గ్రహ సంచారం శుభ ప్రదంగా లేదు. కొన్ని గ్రహాల ఉగ్ర దృష్టి జాతకురాలిపై బడింది. అందుకే ఇప్పుడామె పరిస్థితి ఇలా అయింది. అయినా, ఇలాగే ఎంతోకాలం కొనసాగదు. సరిగ్గా చెప్పాలంటే, ప్రస్తుత గ్రహస్థితి మారడానికి పదకొండు నెలలా పదకొండు రోజులు పడతాయి. ఆ తరవాత ఆమె మామూలు మనిషి అవుతుంది. అంత వరకు ఆమెను జాగ్రత్తగా కాపాడాలి. ముఖ్యంగా, ప్రస్తుతం వుంటూన్న ఈ భవనం నుంచి ఆమె నివాసం వేరొక చోటికి మార్చడం అవసరం!" అన్నాడు.



"ఈ స్థితిలో అమ్మాయిని ఎక్కడికి పంపగలం ఆచార్యా?" అని అడిగింది మహారాణి సజలనేత్రాలతో.

జ్యోతిషాచార్యుడు ఏమీ మాట్లాడలేదు.

కొంతసేపు అందరూ మౌనం వహించారు. ఆ తరవాత రాజు, "రాజధానీ నగరాన్ని ఆనుకుని వున్న సారసనరోవరం మధ్య వున్న దీవిలో వేసవి విడిది కని నిర్మించిన విశ్రాంతి భవనం వున్నది. యువరాణిని అక్కడికి తరలించడం మంచిదనుకుంటాను. అది ఇక్కడికి సమీపంలోనే ఉన్నది కాబట్టి, మేము రోజూ వెళ్ళి రావడానికి అనువుగానూ వుంటుంది!" అన్నాడు.



''సారససరోవరం ఇక్కడికి ఆగ్నేయ దిశలోనే కదా ఉన్నది?'' అని అడిగాడు జ్యోతిష్కుడు.

అవును అన్నట్టు రాజు తల పంకించాడు.

''అలాంటప్పుడు యువరాణిని అక్కడ వుంచడం అన్ని విధాలా శ్రేయస్కరం. మరొక ముఖ్య విషయం ఏమంటే యువరాణి అక్కడ ఏకాంతంగానే గడపాలి. తల్లిదండ్రుల దృష్టి కూడా ఆమెపై పడకూడదు. ఆమెకు తోడుగా ఒక పరిచారిక మాత్రం వుంటే చాలు. వారికి ఆహార పానీయాలు రాజభవనం నుంచే పంపవచ్చు. జననీజనకులైన మీరు కూడా ఆమెను నెలకొక్కసారి మాత్రమే వెళ్ళి చూసి రావాలి. మీ కుమార్తె క్షేమం కోసం దీనిని మీరొక తపస్సులాగా భావించి నడుచుకోవాలి. ఇవన్నీ తాత్కాలికమే. గ్రహదోషం తొలగిపోగానే యువరాణి మామూలు మనిషి అవుతుంది. ఆ వెంటనే ఆమెకు వివాహ యోగం కూడా ఉన్నది. కాబట్టి మీకు ఎటువంటి విచారమూ వద్దు. భగవంతుడి మీద భారం వేసి నిశ్చింతగా వుండండి. నేను బయలుదేరేప్పుడు ఇంటివద్ద జగత్పతాచార్యుడు వున్నాడు. ఈ విషయం ఆయనతోనూ సంప్రదించి, మీరు యువరాణిని చూడడానికి శుభ సమయం ఏదో వచ్చి చెబుతాను,'' అని చెప్పి అక్కడి నుంచి బయలుదేరాడు.

ఆ తరవాత జరగవలసిన పనులన్నీ చకచకా జరిగిపోయాయి. విడిది భవనాన్ని సిద్ధం చేయడానికి, రాజు భటులను పంపాడు. విద్యావతి పుట్టినప్పటి నుంచి, ఆమె అవసరాలు చూసుకుంటూన్న రాణిగారి వృద్ధపరిచారిక కమలను, యువరాణితోపాటు పంపాలని రాణి నిర్ణయించింది. యువరాణికీ, పరిచారికకూ కావలసిన ఆహరపానీయాలను రాజప్రాసాదం నుంచి ఆరుగురు చెలికత్తెలు రోజుకు ఇద్దరు ప్రకారం తీసుకువెళ్ళాలని

ఏర్పాటు జరిగింది. కమల ఒక్కతే యువరాణి దగ్గర వుంటుంది.

జ్యోతిషాచార్యుడి సలహా ప్రకారం, సరిగ్గా అర్ధరాత్రి సమయంలో, యువరాణి రాజప్రాసాదం నుంచి, మేనాలో బయలు దేరింది. రాజూ, రాణీ యువరాణిని రాజ ప్రాసాద సింహద్వారం వరకు వచ్చి సాగనంపారు. వృద్ధ పరిచారిక కమలతో పాటు మరిద్దరు చెలికత్తెలు, సారససరో వరం వరకు యువరాణికి తోడుగా వెళ్ళి దిగబెట్టారు. పడవవాడు, యువరాణినీ, పరిచారిక కమలనూ మాత్రం పడవలో ఎక్కించుకుని, సరోవరమధ్యంలో వున్న దీవిలోని విశ్రాంతి భవనం మెట్ల వద్ద దించి, కొంతసేపటికి తిరిగి వచ్చి, ఆ విషయాన్ని అక్కడ నిలబడిన పరిచారిక లకు తెలియజేశాడు.

తమ కుమార్తె నుంచి ఇలా హఠాత్తుగా దూరం కావలసి వచ్చిన విధివైపరీత్యాన్ని తలుచుకుని రాజదంపతులు తీరని విచా రానికి లోనయ్యారు. ఒకరినొకరు ఓదార్చు కుంటూ, కుమార్తెను చూడడానికి తగిన శుభఘడియలు ఏవో చెప్పడానికి జ్యోతిషా చార్యుడు ఎప్పుడు వస్తాడా అని ఎదురు చూడసాగారు.

యువరాణికి ఏర్పడిన స్థితిని గురించి దేశప్రజలకు తెలియజేయడానికి రాజు, భటులను దేశం నలుమూలలకూ పంపాడు. వచ్చే సంవత్సరం యువరాణి జన్మదినోత్సవాలను మరింత ఘనంగా ఏర్పాటు చేయగలమనీ అంతవరకు ప్రజలు జరిగినదానికి దిగులు పడకుండా తమ కర్తవ్యాలను ఎప్పటిలాగే నిర్వర్తించా లని రాజు చాటింపు చేయించాడు. ఆ చాటింపు విని ప్రజలు కొంత ఊరట చెందారు. కొన్ని రోజులు దేశమంతటా ప్రశాంతత చోటు చేసుకున్నది.

ఒకనాడు వేకువజామున, సారస సరోవర విశ్రాంతి భవనంలో వుంటూన్న యువరాణి విద్యావతి, హఠాత్తుగా మాయ మయిందన్న వార్త వినగానే దేశప్రజలు దిగ్భ్రాంతులయ్యారు. —(ఇంకావుంది)






# గురుదక్షిణ-మాతృదక్షిణ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, అర్ధరాత్రి వేళ, భీతిగొలిపే ఈ శ్మశానంలో, తల పెట్టిన కార్యం సాధించేందుకు, దృఢ సంకల్పంతో నువ్వు చూపుతున్న ధైర్య సాహసాలు మెచ్చదగినవే. అయితే వాటితో పాటు మనిషికి లోకజ్ఞతా, సమయస్ఫూర్తీ, లక్ష్యశుద్ధీ ఎంతో అవసరం. అవి లేనివాడు కార్యంసిద్ధించేతరుణంలో దాన్నిచేజేతులా జారవిడవడం జరుగుతుంది. ఇందుకు ఉదాహరణగా సునందుడనే వాడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,"
అంటూ ఇలా చెప్పసాగాడు:

- పూర్వం విరూపదేశానికి బృహస్పతి లాంటి బుద్ధిశాలి అయిన మంత్రి వుండే

## బేతాళ కథలు



మంత్రి అన్నవాడు తప్పుడు సలహాలివ్వ లేడు. రాజ్యంలో ఇబ్బందులు వస్తే అవి తాత్కాలికం,'' అన్నాడు.

చివరకు రాజగురువు కూడా శూర సేనుడిని, మంత్రి సలహాల గురించి హెచ్చరించాడు. రాజు నవ్వి, "గురువర్యా! తమకు దైవకార్యాల గురించి తెలిసినట్లు, రాజకార్యాల గురించి తెలియదు. పాత మంత్రి సలహాలను కూడా ఆరంభంలో కొందరు తప్పుగా అర్థం చేసుకున్నారు. కొత్తమంత్రి సలహాల గొప్పతనం, కొద్ది కాలంలోనే అందరూ అర్థంచేసుకుంటారు," అన్నాడు.

వాడు. మహారాజు శూరసేనుడు ప్రతి విషయానికీ మంత్రిమీదనే ఆధారపడే వాడు. ఆయన పాలనలో దేశం సుభిక్షంగా వుంది. దురదృష్టవశాత్తూ మహామంత్రి అకాలమరణానికి గురయ్యాడు. శూర సేనుడు కొత్తమంత్రిని ఎన్నుకుని, ఆయన సలహాలతో రాజ్యపాలన చేయసాగాడు.

కొత్త మంత్రికి రాజును మెప్పించడం బాగా తెలుసు కానీ, సలహాలివ్వడం బొత్తిగా చేతకాదు. ఆయన తనకు తోచిన సలహాలిస్తూంటే రాజ్యపాలన అస్తవ్యస్తం కాసాగింది. కొందరు రాజుకీవిషయం చెబితే ఆయన అంగీకరించక, ''మంత్రి సలహాతోనే ఈ రాజ్యం సుభిక్షంగా వుంది.

అందుకు రాజగురువు ఏమీ అనలేక పాత మంత్రి ఇంటికి వెళ్ళాడు. పాత మంత్రి భార్య ఆయనకు నమస్కరించి ఉచితాసనం చూపింది. రాజగురువు ఆమెను ఆశీర్వదించి, ''అమ్మాయీ! మహారాజు శూరసేనుడు, నీ భర్తవల్ల బాగా ప్రభావితుడైనాడు. మంత్రులందరూ ప్రతిభావంతులేనని ఆయన నమ్ము తున్నాడు. కానీ నీ భర్త మంత్రి స్థానాన్ని ఇప్పుడొక అసమర్థుడాక్రమించాడు. వాడు తన తప్పుడు సలహాలతో దేశానికి హాని కలిగిస్తున్నాడు. మెచ్చుకోలు కబుర్లతో రాజును మెప్పించి, తన స్థానం పటిష్ఠం చేసుకున్నాడు. కేవలం మంత్రి సలహాల

పైనే ఆధారపడడం, ఏ రాజుకూ మంచిది కాదని శూరసేనుడు గ్రహించలేకపోతు న్నాడు. ప్రస్తుతానికి మనం చేయగలిగిం దేమీ లేదు. కానీ నువ్వు దేశానికొక ఉపకారం చేయాలి. నీ కుమారుడు సునందుడికిప్పుడు పదేళ్ళవయసుగదా! చండకారణ్యంలోని వితండుడి గురుకులా శ్రమానికి వాణ్ణి పంపు. వితండుడు నీ కుమారుణ్ణి విచక్షణాజ్ఞానం గల మహా మంత్రిగా తీర్చిదిద్దుతాడు. నీ కుమారుడు విద్య ముగించుకుని తిరిగివచ్చేవరకూ, మన దేశానికి మోక్షంలేదు,'' అన్నాడు.



పాత మంత్రి భార్య అందుకు సరేనని అలాగే చేసింది. పదేళ్ళ వయసులో సునందుడు, తల్లిని విడిచి చండకారణ్యం చేరుకున్నాడు.

అక్కడ వితండుడు, వాణ్ణి చూసి విషయమడిగి తెలుసుకుని, ''గురుకులా నికి జ్ఞాన సముపార్జన కోసం రావాలి. మంత్రిపదవి నాశించి రాకూడదు. అయినా నీకింకా పదవి గురించి ఆలోచించే వయసు రాలేదు,'' అన్నాడు.

సునందుడు వితండుడికి నమస్క రించి, ''గురువర్యా! నా తండ్రి మంచి సలహాలతో మహారాజుకు సాయపడినమాట నిజం. ఆ విధంగా దేశానికి ఉపకారం జరిగింది. కానీ నా తండ్రి కారణంగా రాజుకు మంత్రి సలహాలన్నీ మంచి సలహా లేనన్న దురభిప్రాయం కలిగింది. అది తొలగించాల్సిన బాధ్యత నాది. సమర్థుడైన మంత్రి, రాజులో విచక్షణాజ్ఞానాన్ని పెంచుతాడు తప్ప. అన్నింటికీ తనపై ఆధారపడేలా చేయడు. నా తండ్రి చేసిన తప్పును సవరించడం కోసమే, నేను తమ వద్దకు వచ్చాను,'' అన్నాడు.

వితండుడు, సునందుణ్ణి దీవించి, ''నీలో గొప్ప తేజస్సుంది. నీ మాటలు వయసుకుమించిన తెలివిని సూచిస్తు న్నాయి. నిన్ను సకల శాస్త్రపారంగతుణ్ణి చేసి, నా తర్వాత ఈ గురుకులాన్ని నీకే అప్పగించాలనిపిస్తున్నది. అయితే, నీ అభి



ప్రాయం కూడా న్యాయమైనదే! కానీ ఒక్క విషయం గుర్తుంచుకో. కేవలం ఉద్యోగం, పదవిని ఆశించి చదివేవాడు, జీవితంలో ఎందుకూ కొరగాకుండా పోతాడు,'' అన్నాడు.

సునందుడు వినయంగా తల వంచి ఊరుకుని, ఆరోజే విద్యాభ్యాసం ప్రారంభించాడు. వితండుడు వాడికి అన్నీ నేర్పుతూనే రాజరికం, మంత్రాంగాల గురించి కూడా వివరిస్తూండేవాడు. ఆ విధంగా మూడు సంవత్సరాలు గడిచేసరికి, వాడు తనకంటే ముందు చేరినవారిని కూడా అధిగమించి గురుకులంలో ప్రథముడుగా నిలిచాడు.

ఒక రోజున వితండుడు శిష్యులందర్నీ సమావేశపరిచి, ''మీలో రమాకాంతుడు ఎందుకూ కొరగానివాడని గుర్తించాను. ఇన్నేళ్ళ నా శిక్షణ వాడి విషయంలో వృధా అయిందని నాకెంతో బాధగా వుంది. మీలో ఎవరైనా వాడి బాధ్యతను స్వీకరించి, వాడి మెదడులో రవంత జ్ఞానాన్ని ప్రవేశపెట్టినా, నాకు సంతోషం. అలా చేసినవాడికి నా తదనంతరం గురుకులం అప్పజెబుతాను,'' అన్నాడు.

ఇది వింటూనే రమాకాంతుడు కోపంగా లేచి, ''నా సాటివారిచేత పాఠాలు చెప్పించుకునేందుకు నేనిక్కడికి రాలేదు. నలుగురిముందూ నా గురువే నన్నిలా అవమానించాక, నాకిక్కడ పనేముంది?'' అని వెళ్ళిపోయాడు.

అప్పుడు వితండుడు నిట్టూర్చి, ''రమాకాంతుడికి మంత్రి కావాలన్న కోరిక ప్రబలంగా వుంది. అందువల్ల వాడికి ఏ విద్యా అబ్బలేదు.'' అన్నాడు.

మరొక రెండు సంవత్సరాలకు సునందుడి విద్యాభ్యాసం పూర్తయింది. వాడు వితండుణ్ణి గురుదక్షిణగా ఏం కావాలని అడిగాడు.

''నువ్వు నా గురుకులాన్ని నడుపుతానంటే అదే నాకు గురుదక్షిణ!'' అన్నాడు వితండుడు.

"గురువర్యా! గురువుకంటే ప్రథమ స్థానం తల్లిదని సర్వశాస్త్రాలూ ఘోషిస్తున్నాయి. మాతృదక్షిణను కాదని గురుదక్షిణ ఇమ్మని తమరాదేశిస్తే, అలాగే చేస్తాను," అన్నాడు సునందుడు.

వితండుడు, సునందుణ్ణి ఆశీర్వదించి, "పదిహేనేళ్ళ వయసుకే ఇంతవాడివయ్యావు. నీ జ్ఞానం ఒక రాజభవనానికీ, నీ తెలివి ఒక రాజుకూ పరిమితం కావడం ఇష్టం లేక అలా అన్నాను. నీ మనసుకు తోచినపని ఏది చేస్తే, అదే నాకు గురుదక్షిణ. వెళ్ళిరా నాయనా!" అన్నాడు.



సునందుడు విరూపదేశంలో ప్రవేశించి, శూరసేను డిప్పుడు రాజ్యమేలడం-లేదనీ, ఆయన అనారోగ్యంతో మంచం పట్టడం వల్ల మూడు సంవత్సరాలుగా శూరసేనుడి కొడుకు వీరసేనుడు రాజ్యమేలుతున్నాడనీ తెలుసుకున్నాడు.

వీరసేనుడు గొప్ప అహంకారి. అన్నీ తనకే తెలుసుననుకుంటాడు. తనకు సలహాలివ్వడానికి కాక, తను చెప్పింది అవుననడానికే మంత్రి కావాలి అతడికి! తన తండ్రి శూరసేనుణ్ణి మెప్పించిన మంత్రి అసమర్థుడని అంతా అనడంవల్ల, కొత్త మంత్రి కోసం ప్రకటన చేశాడు.

సునందుడు ఇల్లు చేరగానే తల్లి ఈ విషయాలన్నీ చెప్పి, "నువ్వు సరైన సమయానికే వచ్చావు. రేపే వీరసేనుడు కొత్త మంత్రిని ఎన్నుకోబోతున్నాడు. నువ్వాయనకు మంత్రివై, తండ్రిని మించిన తనయుడనిపించుకోవాలి," అన్నది.

దురదృష్టం కొద్దీ ఆ రాత్రే సునందుడికి ఒళ్ళు తెలియని జ్వరం వచ్చింది. అది తగ్గి వాడు మామూలు మనిషి కావడానికి వారం రోజులు పట్టింది. అప్పుడు రాజగురువు వచ్చి వాణ్ణి కలుసుకుని, "నాయనా! కొత్తమంత్రి ఎన్నిక అయిపోయింది. నీవు వచ్చినట్లు నాకు ఆలస్యంగా తెలిసింది. ఇప్పటికైనా సమయం మించిపోలేదు. నాతో వస్తే రాజుకు నిన్ను పరిచయం చేస్తాను. నేను



చెబితే ఇద్దరు మంత్రులను తీసుకునేందుకు రాజు వెనుకాడడు. ప్రస్తుత పరిస్థితిలో దేశానికి నీ అవసరం ఎంతైనా వుంది,'' అన్నాడు.

సునందు డందుకు అంగీకరించినా, ముందుగా కొత్తమంత్రిని కలుసుకుని మాట్లాడాలన్నాడు. రాజగురువు వాణ్ణి కొత్త మంత్రివద్దకు తీసుకువెళ్ళాడు. వితండు డెందుకూ పనికి రానివాడని తీర్మానించిన రమాకాంతు డక్కడ వాడికి కొత్తమంత్రి వేషంలో దర్శనమిచ్చాడు.

ఇద్దరూ పరస్పరం కుశలప్రశ్నలు వేసుకున్నాక, రాజగురువు రమాకాంతుడికి తన మనసులోని మాట చెప్పాడు. అందుకు రమాకాంతుడెంతో సంతోషించి, ''మన మిద్దరం కలిసి మంత్రులుగా ఒకే రాజువద్ద పనిజేయడం, నా అదృష్టంగా భావిస్తాను,'' అన్నాడు.

సునందుడు మాత్రం రమాకాంతుడి భుజం తట్టి, ''నేను నిన్ను అభినందించాలని వచ్చాను. గురువుగారు గురుకులం బాధ్యత తీసుకుంటే, అదే నా గురుదక్షిణ అన్నారు. ఆయన మాట కాదనలేను. నేనిప్పుడు చండకారణ్యానికి వెళుతున్నాను,'' అని ఇంటికిపోయి, తల్లిని వెంటబెట్టుకుని చండకారణ్యంలోని గురుకులానికి బయలుదేరాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, గురుదక్షిణకంటే, మాతృదక్షిణ ముఖ్యమని రాజ్యానికి తిరిగి వచ్చి మంత్రి కాదలచిన సునందుడు, మనసెందుకు మార్చుకున్నాడు? వీరసేనుడు కొత్త మంత్రిని ఎన్నుకునే రోజునే, తనకు జ్వరం వచ్చి ఇల్లు కదలలేకపోవడం దైవ సంకల్పమనుకున్నాడా? అలా కాక, రమాకాంతుడి వంటి పనికిమాలినవాడితో కలిసి పని చేయడం అవమానంగా భావించాడా? అన్నిటినీ మించి, అలాంటి అసమర్థుడు మంత్రిగా వున్నప్పుడే రాజుకు తనబోటివాడి అవసరం అతి ముఖ్యమని

ఎందుకు గ్రహించలేకపోయాడు? విత్తండుడివంటి ఉద్దండపండితుడి వద్ద శిక్షణ పొందినా, సునందుడిలో లోకజ్ఞతా, సమయస్ఫూర్తీ, లక్ష్యశుద్ధీ లోపించడానికి కారణం ఏమిటి? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''తన విద్యా, తెలివితేటలూ ఒక రాజుకు పరిమితం చేయకుండా, ఎందరికో ఉపయోగపడేలా చేయమని గురువు చెప్పినా వినకుండా, సునందుడు ఇంటికి తిరిగి వచ్చాడు. అందుక్కారణం వాడికి తల్లీ, రాజగురువులపట్లగల భక్తిగౌరవాలు. అయితే, కొత్త రాజు వీరసేనుడు మంత్రిని ఎన్నుకున్న తీరు వాణ్ణి ఆశ్చర్యపరచడమేగాక, ఆలోచించేలా చేసింది. వీరసేనుడు అహంకారే కావచ్చు, కాని తెలివైనవాడు. ఆయన తెలివితక్కువవాడైతే, మంత్రి తెలివైనవాడైనా ఆ తెలివి వృథా. సునందుడు తెలివైనవాడు కాబట్టి తన సలహాలతో రాజుకు సాయపడగలడు. అయితే, రాజు తన తెలివి అంతా వెచ్చించి రమాకాంతుణ్ణి మంత్రిగా ఎన్నుకున్నాడు. ఒక తెలివైనవాడు రమాకాంతుడిలాంటి వాణ్ణి మంత్రిగా ఎన్నుకున్నాడంటే అర్థమేమిటి? ఆయన దృష్టిలో మంత్రి పదవికి ఏమాత్రమూ విలువ లేదన్న మాట. అది కేవలం అలంకారప్రాయం మాత్రమే. అలాంటి మంత్రిపదవికోసం, సునందుడు తన విద్యావిజ్ఞానాలను వృథా చేసుకుంటే, అది మాతృదక్షిణ అనిపించుకోదు. అందుకే వాటిని గురుదక్షిణగా ఇచ్చి, గురుకులాన్ని సమర్థవంతంగా నడిపి, తన జీవితాన్ని సార్థకం చేసుకుందామనుకున్నాడు. అంతేతప్ప, వాడిలో లోకజ్ఞతా, సమయస్ఫూర్తీ, లక్ష్యశుద్ధీ లోపించడం వల్ల కాదు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: "వసుంధర" రచన]



# అసలు రహస్యం

శ్రీపురం జమీందారు తన దగ్గిరకు పనిచేయడానికి వచ్చేవాళ్ళను, మూడు ప్రశ్నలు అడిగి, వాటికి నరైన నమాధానం చెప్పిన వాళ్ళను మాత్రమే పనిలోకి తీసుకునేవాడు. ఒక్కొక్కసారి ఆయన ప్రశ్నలు అతి సామాన్యంగా వుండి, సులభంగా జవాబు చెప్పగలిగేవిగా వుండేవి. మరొక సారి ఎవరికీ అంతుపట్టని విధంగా కఠినంగా వుండేవి.

చెంగయ్య అనే చెవిటి వాడు, ఒకసారి ఆయనదగ్గిరకు పనికోనం వెళ్ళాడు. జమీందారు వాణ్ణి పరీక్షగా చూసి, "ఒకసారిపోయినా, సులభంగా నంపాయించుకోగలది ఏది?" అని ప్రశ్నించాడు.

"డబ్బు!" అన్నాడు చెంగయ్య.

"ఒకసారిపోతే, మళ్ళీ ఎప్పటికీ దొరకనిది ఏది?" అని ప్రశ్నించాడు జమీందారు.

"రాత్రి-పగలు!" అన్నాడు చెంగయ్య తడుముకోకుండా.

"సాయంచేసినవాడికి, సాయం పొందినవాడు ఎంతకాలం కృతజ్ఞుడుగా వుండాలి?" అని ప్రశ్నించాడు జమీందారు.

"బ్రతికినన్నాళ్ళు!" అన్నాడు చెంగయ్య.

జమీందారు, ఈ జవాబులకు చాలా నంతోషించి, చెంగయ్యకు పని ఇచ్చాడు. అయితే, కొద్ది రోజుల్లోనే ఆయనకు వాడు చెవిటివాడని తెలిసి, "ఒరే, ఆ రోజు నా ప్రశ్నలకు ఎలా నమాధానం చెప్పగలిగావు?" అని గట్టిగా అరిచాడు.

అంతగట్టిగా అరిచి అడిగిన ప్రశ్న వినిపించడంతో చెంగయ్య, "అయ్యా, తమరడిగిన మూడు ప్రశ్నలూ, నా జవాబులూ ఇంకా నాకు గుర్తున్నవి. ఏం కావాలి నీకు? అని అడిగారనుకుని, డబ్బు అన్నాను. నువ్వు ఎప్పుడు పని చెయ్యగలవని, అడిగారనుకుని, రాత్రి-పగలు అనేశాను. మూడో ప్రశ్నగా, ఎంతకాలం పని చెయ్యగలవని అడిగారనుకుని, బ్రతికినన్నాళ్ళు, అన్నాను," అన్నాడు.

నంగతి తెలిసిన జమీందారు, "ఓరి, చెవిటివెధవా! ఇదా నువ్వు, నా దగ్గిర పని నంపాయించిన అనలు రహన్యం!" అంటూ పొట్ట చెక్కలయ్యేలా నవ్వుకున్నాడు. —ఎం. రమాదేవి



# చందమామ
## అనుబంధం—42



మనదేశపు పక్షులు-జంతువులు :

## సింహం

ప్రాచీనకాలం నుంచీ 'మృగరాజు'గా కీర్తిగాంచిన వన్యమృగం సింహం. మన పంచతంత్ర కథలలోనూ, ఈసప్ కథలలోనూ సింహానికి 'అడవిరాజు'గా విశిష్టమైన స్థానం ఉన్నది. మొదట మన జాతీయ మృగంగా కూడా సింహమే వుండేది. అయితే, వీటి సంఖ్య క్రమంగా తగ్గిపోవడం వల్ల, ఆ స్థానాన్ని ప్రస్తుతం పులి ఆక్రమించింది!

మగసింహాలకు ప్రత్యేకంగా వున్న గుబురైన జూలు కారణంగా అవి ఎంతో గంభీరంగా కనిపిస్తాయి. సింహం కూడా పులి లాగా 'పిల్లి' జాతికి చెందిన వన్యమృగమే. కాని జూలు కారణంగా ఇది పిల్లి లాగా కనిపించదు. బాగా ఎదిగిన సింహం, ముక్కు చివరి నుంచి తోకవరకు కొలిస్తే **275** సెం. మీ. పొడవు వుంటుంది. **90** సెం. మీ. ఎత్తు పెరుగుతుంది. పసుపురంగు కలిసిన బూడిద రంగులో కనిపించే సింహం జూలు, మరింత ముదురు రంగులో వుంటుంది. సింహాలు నాలు గయిదు నుంచి, ఇరవైవరకు ఒకటిగా చేరి గుంపులు గుంపులుగా నివసిస్తాయి.

ఒకప్పుడు భారతదేశమంతటా తిరిగిన సింహాలను, సైబీరియా నుంచి వచ్చిన మరింత క్రూరమైన పులులు దక్షిణ ప్రాంతాలకు తరుమగొట్టాయి. ప్రస్తుతం గుజరాత్ రాష్ట్రంలోని "గిర్ నేషనల్ పార్క్'లో **230** సింహాలు ఉన్నాయి.

వార్తలలో బాలలు:

# బాల విలేకరి!

గత నవంబర్ నెలలో కేరళరాష్ట్ర రాజధాని తిరువనంతపురంలో అంతర్జాతీయ బాలల చలన చిత్రోత్సవం జరిగింది. ఆ సమయంలో పత్రికా విలేకరుల మధ్య ఒక పదేళ్ళ అమ్మాయి అక్కడి అందరి దృష్టినీ ఆకర్షించింది. విదేశాలనుంచి వచ్చిన ఏదో పత్రిక ప్రతినిధి వెంట, ఆ అమ్మాయి వచ్చి వుంటుందని మొదట అనుకున్నారు. కాని, ఆమె దగ్గర ప్రత్యేకంగా 'ఐడెంటిటీ కార్డు' చూసి అందరూ ఆశ్చర్యపడ్డారు!

ఆమె పేరు ఇనే హిక్కనెన్. 'ఫిన్నిష్ టీవీ' ప్రతినిధిగా ఆమె ఆ చిత్రోత్సవంలో పాల్గొన్నది. ఇక్కడి చిత్రాలను చూసి, చిత్ర ప్రముఖులను కలుసుకుని, ఇంటర్వ్యూలు జరిపి విశేషాలను ఫిన్‌లాండ్‌టీవీకి పంపడానికి అక్కడి నుంచి వచ్చిన ఆరుగురు 'టీవీటీమ్'లో ఆ అమ్మాయి ఒకతె!

తిరువనంతపురం వచ్చి చేరగానే, ఆమెను నగర మధ్యంలో వున్న 'కనకకున్ను' భవనానికి తీసుకుపోయారు. అక్కడే బాలల చలన చిత్రోత్సవం ఏర్పాటు చేశారు. ఆ భవనం చూట్టూ అందమైన ప్రకృతి దృశ్యాలను చూసి ఆమె ఎంతగానో ఆనందించింది. ఆ తరవాత రెండు వారాలపాటు జరిగిన చిత్రోత్సవంలో అమితోత్సాహంతో ఎన్నో చలన చిత్రాలను చూసింది. మన బాల నటుల ప్రతిభను ఎంతగానో మెచ్చుకున్నది. ఉత్సవ నిర్వాహకులు ఏర్పాటు చేసిన కేరళ వంటకాలను చాలా ఇష్టంగా తిన్నది. అన్నిటికన్నా కేరళ రాష్ట్రంలో 'నేంద్రంఫలం' అని ప్రసిద్ధిగాంచిన అరటిపళ్ళంటే ఆమె ఎంతో ప్రీతిని కనబరిచింది!

నాలగవతరగతి చదువుతున్న ఇనే, సినిమాలు చూస్తూ, తీరిక దొరికినప్పుడల్లా, దేశం నలు మూలల నుంచి వచ్చిన బాలబాలికలతో కలిసి కబుర్లు చెప్పుకుంటూ, వాళ్ళకోసం ఏర్పాటు చేసిన ఆటలలో పాల్గొన్నది.

“ఇది కేవలం చిత్రోత్సవం మాత్రమే కాదు. నిజంగానే మా కళ్ళకు గొప్ప విందు వంటిది!” అన్నది ఇనే. ఎందుకంటే ఫిన్‌లాండ్‌లో అంతగా బాలల చిత్రాలను నిర్మించడం లేదు. ఇనే అంతకు ముందు థియేటర్లలోనూ, టీవీలోనూ చూసిన మొత్తం చిత్రాలకు రెండింతలు చిత్రాలు ఇక్కడ రెండు వారాలలో చూసింది. వాటిలో ఆమెకు చాలా చిత్రాలు బాగా నచ్చాయి. ముఖ్యంగా 'అభయం' అనే మలయాళ చిత్రం తనను ఎంతగానో ఆకట్టుకున్నట్టు ఆమె తెలియజేసింది. ఎప్పుడు చూసినా చదవమని నిర్బంధించే తల్లి నుంచి, పదేళ్ళ కుర్రాడు తాతయ్య ప్రియమైన సాహచర్యంలో 'అభయం' పొందడం ఆ చిత్రం ఇతివృత్తం.

శ్రద్ధగా చదివే ఇనేకు పియానో వాయించడం బాగా వచ్చు. చిత్ర లేఖనం పట్ల చాలా ఆసక్తి ఉన్నది. టెన్నిస్ ఆట అన్నా ఎంతో ఇష్టం. స్టెఫీగ్రాఫ్ ఆమె అభిమాన 'తార!'



# మీకు తెలుసా?

1. పంది జాతికి చెందిన అతిపెద్ద జంతువు ఏది?
2. 'జిప్సీ'ల భాష ఏది?
3. ఒకదేశం చుట్టూ నగరం వున్నది. దేశం ఏది? నగరం ఏది?
4. 'ఫౌంటన్ పెన్'ను కనుగొన్నవారెవరు?
5. అట్లాంటిక్ మీదుగా ఒంటరిగా ప్రయాణం చేసిన మొట్టమొదటి 'మహిళా పైలట్' ఎవరు?
6. ఒక్క సంఖ్యను తప్ప మిగతా అన్ని సంఖ్యలనూ రోమను పద్ధతిలో రాయవచ్చు. అది ఏది?
7. ఎర్రగా వున్న గ్రహం ఏది?
8. ప్రపంచ వ్యాప్తంగా తపాలాపెట్టెలమీద ఎర్ర రంగు వాడటానికి పూర్వం, ఏ రంగును ఉపయోగించేవారు?
9. కీలు బొమ్మలు చేయడం ఎక్కడ ప్రారంభమయింది?
10. 'బాటిక్' పద్ధతి చిత్రలేఖనం ప్రప్రథమంగా ఏ దేశంలో మొదలయింది?
11. పీతలు ఎలా నడుస్తాయి?
12. సర్ రోగర్ బానిష్టర్ ఎందులో సుప్రసిద్ధుడు?
13. తెల్లఏనుగుల జన్మస్థానం ఏది?
14. డా॥ క్రిస్టియన్ బార్నార్డ్ 1967 వ సం॥లో ఒక నూతన శస్త్ర చికిత్సా పద్ధతిని ప్రవేశపెట్టాడు. అది ఏమిటి?
15. అంతరిక్షంలోకి వెళ్ళిన (1990 వ సం॥లో) మొట్టమొదటి పాత్రికేయుడు ఎవరు?

## సమాధానాలు

1. నీటి ఏనుగు.
2. రోమనీ.
3. వెటికన్; రోమ్.
4. లూయీ వాటర్‌మన్.
5. అమీలియా ఎర్‌హార్ట్, 1928 వ సం॥లో.
6. సున్న.
7. అంగారక గ్రహం.
8. ఆకుపచ్చ.
9. ఇండియా, ఈజిప్టు.
10. ఇండొనేషియా.
11. పక్కవైపులకేసి.
12. మొట్టమొదటిసారిగా ఒక మైలు దూరం. 4 నిమిషాలలోగా పరిగెత్తాడు.
13. సియామ్. ఈనాటి థాయ్‌లాండ్.
14. గుండె మార్పిడి.
15. జపానుకు చెందిన టోయో హిరో అకియామా.

# చందమామ కబుర్లు

## వానర 'తార'

జపానులో 1992వ సంవత్సరాన్ని 'వానర వత్సరం'గా పాటిస్తున్నారు. అది వాళ్ళు ఇప్పుడు కోతులకు ఇస్తున్న ప్రాముఖ్యతను చాటుతున్నది. మామూలుగా మన దేశంలో కనిపించే 'కోతుల ఆటలు' ఇవాళ జపానులో వీధులనుంచి నాటక వేదికలమీదికి వెళ్ళాయి. వాటిని 'సరుమవాషీ' అని అంటారు. దాదాపు వెయ్యేళ్ళకు పూర్వం ఈ 'వానర క్రీడలు' చైనానుంచి జపానుకు వచ్చాయి. వాళ్ళు దాని నొక కళగా అభివృద్ధిపరచారు. అయితే, 1860 అనంతరం జరిగిన పాశ్చాత్యీకరణ కారణంగా అది ప్రాచుర్యం కోల్పోయి మరుగున పడిపోయింది. అయితే, అది ఇటీవల దానికి ఆదరణ పెరిగింది. అమెరికాలో ప్రసారంచేయడానికి సుప్రసిద్ధ టి వి వానర తార 'జిరో'కు 'హేమ్లట్' ప్రదర్శనకోసం శిక్షణనిస్తున్నారు.





## అధిక బరువు!

న్యూయార్క్ నగరంలోని వాసన్ ప్రాంతంలో నివసించే వాల్టర్ హడ్సన్ అనే పెద్ద మనిషి పద్దెనిమిది సంవత్సరాలు ఇల్లు కదలలేకపోయాడు. కారణం అతడి భారీ శరీరం; ఒకప్పుడాయన 544 కి. గ్రా. బరువు వుండేవాడు. ఎంతో ప్రయత్నించి అతి కష్టంమీద శరీరాన్ని 236 కి. గ్రా. కు తగ్గించాడు. అప్పుడే ఆయన చాలా అరుదుగా అటూ ఇటూ తిరగసాగాడు. రెండు నెలల క్రితం ఆయన మరణించేప్పుడు ఆయన వయసు 48 సంవత్సరాలు. అప్పుడాయన బరువు 272 కి. గ్రా. అతని భారీకాయం గడప పట్టకపోవడం వల్ల అంత్యక్రియలు కూడా కొంత ఆలస్యంగా జరిగాయి.



# నంగిరిదేవయ్య

బియ్యవరం అనే గ్రామంలో, దేవయ్య అనే పనీ పాటు లేనివాడొకడుండేవాడు. వాడు ముక్కుతో తమాషాగా మాట్లాడుతూ, ఉన్నట్టుండి ముక్కు పొడుం గట్టిగా పీల్చి పెద్దగా తుమ్మేవాడు. ఇది అందరికీ వినోదంగా వుండి వాణ్ణి నంగిరి దేవయ్య అని పిలిచేవారు.

నంగిరిదేవయ్య ఎప్పుడూ ఎవరింట్లో భోజనం దొరుకుతుందా, ఎవరినెత్తికొట్టి డబ్బులు సంపాదిద్దామా అని ఆలోచిస్తూండేవాడు. గ్రామంలో ఎవరింట పెళ్ళయినా, బాలసాల అయినా, ఆఖరికి తద్దినమైనా సరే, వాడు అక్కడికి వెళ్ళి నంగిరి మాటలతో వాళ్ళను నవ్వించి, వాళ్ళచేత ఇంటికి భోజనానికి పిలిపించుకునే వాడు.

ఇక భోజనం ముందు కూర్చున్నాక, "మీకు తెలీదు, నాకు చచ్చేంత మొహమాటం. అయినా, ఏదో మీరు పిలిచారు కదా, రాక ఎలా తప్పుతుంది? మామూలుగా ఎవరింటికీ నేవెళ్ళను. మరొక సంగతి. ఇప్పుడు తక్కువగా తింటే మీరు బాధపడతారు, ఎక్కువ తినలేకపోయినా మిమ్మల్ని నిరాశపరచకూడదు!'' అంటూ హాయిగా ఇద్దరి భోజనం తినేవాడు— చూసేవాళ్ళకు మాత్రం మొహమాటస్థుడనిపించేలాగా.

క్రమంగా నంగిరి దేవయ్య సంగతి ఊళ్ళో అందరికీ తెలిసిపోయింది. దానితో వాడు భోజనానికి గ్రామస్థుల మీద కాకుండా, ఉద్యోగరీత్యా అక్కడికి బదిలీ అయి వచ్చే కొత్తవాళ్ళమీద ఆధారపడసాగాడు.

ఒకనాడు దేవయ్యకు కొత్తగా వచ్చిన బాపనయ్య అనే కచ్చేరీ ఉద్యోగి మామిడాకులు, అరిటాకులు పట్టుకుపోతూ

జె. ఉదయనాగశిరీష



కనిపించాడు. క్షణాలమీద వాడు ఆయనతో పరిచయం చేసుకుని, వాళ్ళింట్లో త్రినాథ వ్రతమని తెలుసుకున్నాడు.

వాడు, బాపనయ్యతో, "మరి చెప్పారు కాదేమండీ! వ్రతం చేసుకున్నాక బంధు మిత్ర సపరివారంగా ఆరగించాలి. ఈ రోజు సంగమేశ్వర శాస్త్రిగారు పిలిచారనుకోండి. ఎరిగినవారు గనక ఆయనింటికి మరెప్పుడైనా వెళ్ళవచ్చు. కొత్తగా గ్రామం వచ్చిన మీ ఇంటికి రావడం అన్ని విధాలా ధర్మం. ఎంత, క్షణంలో వచ్చేస్తాను. మీరుండడం కంచిమేక కామయ్యగారింట్లోనే కదా!" అంటూ ముక్కుపొడుం పట్టుపట్టి ఠపీమని తుమ్మాడు.

బాపనయ్య, తను ముక్కూ మొహం ఎరగనివాడు ఇంత మాట్లాడడం విని తెల్లబోయినా, సాటి మనిషి భోజనానికి వస్తానంటున్నాడని, "సరే, త్వరగా రండి!" అన్నాడు.

అయితే, నంగిరిదేవయ్య ఆ రోజు బాపనయ్య ఇంటికి భోజనానికి వెళ్ళలేదు. వాడికి ఆ గ్రామ పురోహితుడి కుటుంబం సింహాచల యాత్రకు వెళుతున్నట్టు తెలిసి, అక్కడికి పోయి పురోహితుడితో, "అయ్యయ్యో, మీకు మరీ అంత మొహమాటమైతే ఎలా? నేను మీతో కూడా వచ్చి, అన్నివిధాలా సాయం చేయదలిచాను. ఇక, నాపనులంటారా? వాటిని ఎప్పుడైనా చేసుకోవచ్చు." అని గుక్క తిప్పుకోకుండా మాట్లాడి ఆయనను మొహమాట పెట్టేసి, వాళ్ళ కుటుంబంతోపాటు సింహాచలం వెళ్ళిపోయాడు.

ఇక, బాపనయ్య, దేవయ్య వస్తాడనే నమ్మకంతో ఆరోజు సాయంత్రంవరకూ వాడికోసం ఎదురుచూసి, ఆ తర్వాత భోజనంచేశాడు.

వారం రోజుల తర్వాత దేవయ్య సింహాచలం నుంచి తిరిగివచ్చి, ఒక ఉదయాన బాపనయ్యకు వీధిలో తారసిల్లాడు. బాపనయ్య వాణ్ణి చూస్తూనే పట్టరాని కోపంతో ఏదో అనబోయేంతలో, వాడు ఏమీ

తొణకుండా, ''కోపగించకండి! నాలోని ప్రత్యేకత, ఈసరికి మీకు బాగా అర్థమై వుంటుంది. అభిమానం, అంతకు మించిన గౌరవం కొద్దీ నన్ను, భోజనానికి పిలిచిన వాళ్ళు, రాలేదని చాలా బాధపడిపోతారు. మిమ్మల్ని అంతగా బాధపెట్టినందుకు పరిహారంగా, ఈ రోజు రెండు పూటలా, మీ ఇంటనే భోజనం, స్నానం అదీ కూడా మీ ఇంటనే, పదండి!'' అంటూ బాపనయ్య భుజంమీద చెయ్యివేసి, ఆయన ఇంటికి వెళ్ళాడు.

బాపనయ్య ఇంట్లో, ఆయన మేనత్త ఒక బామ్మగారుంది. ఆవిడ ఎవరినైనాసరే, ఒరేయ్ అని పిలుస్తుంది. ఆ పిలుపు దేవయ్యకు కాస్త బాధనిపించింది.

దేవయ్య ఇంత పొడుం పీల్చి గట్టిగా తుమ్మగానే, బామ్మ దడుచుకున్నట్టు ముఖం పెట్టి, ''ఒరేయ్, నంగిరీ! నీ గురించి సర్వం విన్నాను. ఆ తుమ్ములు ఆపు. పొడుం పీల్చి పీల్చి, నీ ముక్కే పొడుంకాయలా తయారైంది. వంటవు తున్నది, ఇంట్లో మడినీళ్ళయిపోయాయి. నువ్వింకా స్నానం అఘోరించలేదుకదా. స్నానంచేసి, ఆ చేత్తోనే నాలుగైదు బిందెల నీళ్ళు బావిలోంచి తోడుకురారా!'' అన్నది ఆజ్ఞాపిస్తున్నట్టు.

దేవయ్య బావిలో ఎక్కడో పాతాళ గంగలా వున్న నీళ్ళను బొక్కెనతో పైకి లాగుతూ, ''అయ్యో, ఎరక్కపోయివస్తిని గదా, ఈ కొంపకు!'' అనుకోసాగాడు.



వాడు నాలుగు బిందెల నీళ్ళు తోడి, ఆయాసపడడం గమనించిన బామ్మ, ''తేరగా తినడానికి తయారయ్యావు. నీళ్ళు చేదడానికి నానా హైరానా పడిపోతున్నావు. నంగిరివెధవా! ఇక, తిందువుగాని రా!'' అని పిలిచింది.

ఆమె విస్తట్లో అన్నం, కూరలూ వడ్డించగానే దేవయ్య ఆవురావురుమంటూ తినసాగాడు. అది గమనించిన బామ్మ, ''రాత్రి కూడా వుంటావని అన్నీ కాస్త ఎక్కువగానే వండాను. ఒక్క పూటలోనే స్వాహా అంటే ఎలా? మనిషయినవాడికి కొంచెం మొహమాటం వుండాలిరా! దొరికింది గదా అని, మొత్తం ఊడ్చేస్తే, రేపు నిన్నెవరు పిలుస్తార్రా, నంగిరీ?'' అన్నది కోపంగా.

ఈనాటివరకూ, అవతలివాళ్ళను మాట్లాడనీయకుండా, తప్పనిసరై మీ ఇంటికి భోజనానికి వచ్చానని చెప్పే దేవయ్యకు, బామ్మగారి బాకుల్లాంటి మాటలు కళ్ళనీళ్ళు తెప్పించాయి.

వాడు భోజనం ముగించి, చెయ్యి కడుక్కోవడానికి లేచిపోతుంటే, బామ్మ వాణ్ణి ఆపి, ''ఒరే, అప్పనంగా తిండి తినేసిపోతే, నీ ఎంగిలాకు ఎవడెత్తుతాడు? పనీ పాటు లేని వెధవ్వి, మాటలు చెప్పి తిండి తినిపోయే, నీ లాంటి పనికిమాలిన వాడి ఎంగిలాకు ఎత్తితే, పాపం. నాకు మడీ, ఆచారం. ఆకు బయటపారేసి, గతికినచోట పసుపునీళ్ళతో కాస్త శుభ్రం చెయ్యి.'' అన్నది.

నంగిరి దేవయ్య, అంతా బామ్మ చెప్పినట్టే కిక్కురుమనకుండా చేసి, ఆ ఇంటి నుంచి బయటపడి, ఆ రాత్రికి మళ్ళీ భోజనానికి ఆ ఇంటి ఛాయలకూడా వెళ్ళలేదు.

ఆనాటి నుంచి, ఎవరైనా జాలిపడి వాణ్ణి భోజనానికి పిలిచినా, ఒకటికి రెండుసార్లు ఆలోచించి వెళ్ళేవాడు తప్ప, మాటకారితనం ఉపయోగించి పరాయి ఇళ్ళభోజనం చేసే అలవాటు మానుకున్నాడు.





# దానశీలి కల

పూర్వం అవంతీ రాజ్యంలో, మహారాజు అంతరంగిక సలహాదారు పదవికి ఖాళీ ఏర్పడింది. అంతవరకు ఆ పదవిలో వున్న జయానందుడు వార్ధక్య భారానికి తోడు, అనారోగ్యానికి గురి కావడంతో, ఆ స్థానానికి మరొకరిని ఎంపిక చేయవలసి వచ్చింది. ఈ విషయం రాజు వీరవర్మకొక పెద్ద సమస్యగా మారింది. కారణం, ఎంతో సూక్ష్మబుద్ధి గల జయానందుడు, ఇంతవరకు ఆ పదవిని సమర్థవంతంగా నిర్వహించాడు.

ఒకనాడు రాజు, ఈ విషయం గురించి తన మంత్రి సుబుద్ధితో ప్రస్తావించగా, ఆయన, "మహారాజా! ముందు దేశంలో రాజనీతి, ఆర్థిక, న్యాయ శాస్త్రాలను అభ్యసించిన వారందరినీ ఆహ్వానిద్దాం. వారికి శాస్త్ర విషయమై పరీక్ష నిర్వహించి, అందులో ప్రతిభ చూపినవారిని గుర్తిద్దాం. ఆ తర్వాత జయానందుడి సలహాపై, వారిలో ఒకరిని తమ అంతరంగిక సలహాదారుగా నియమించవచ్చు." అని సలహా ఇచ్చాడు.

రాజు ఇందుకు సమ్మతించగానే, మంత్రి వెంటనే దేశమంతటా చాటింపు వేయించాడు.

ఈ చాటింపు విని దేశం నలుమూలల నుంచి అనేకమంది యువకులు వచ్చారు. వారందరికీ శాస్త్రపరమైన పరీక్షలు నిర్వహించగా జయుడు, విజయుడు అనే వాళ్ళు ప్రథములుగా నిలిచారు. వాళ్ళిద్దరూ సమఉజ్జీలు కావడంతో మంత్రి సుబుద్ధి, జయానందుడిని కలుసుకుని సంగతి వివరించాడు.

జయానందుడు అంతా విని, "అంతరంగిక సలహాదారన్నవాడు శాస్త్రాలలో పండితుడైనంతమాత్రాన సరిపోదు. క్లిష్ట

అయ్యగారి శర్మ



మైన సమస్యలు ఎదురైనప్పుడు, వాటిని పరిష్కరించగల యుక్తి కూడా అతనికి కావాలి. శాస్త్రపరంగా ఉద్దండులైన, ఆ యువకులిద్దరిలో పదవికి ఎవరు అర్హులో, ఈ ఆఖరు పరీక్ష నిర్ణయిస్తుంది,'' అని, ఏం చేయాలో మంత్రి సుబుద్ధికి వివరించాడు.

మర్నాడు మంత్రి జయుణ్ణీ, విజయుణ్ణీ పిలిపించి, కొద్దిసేపు వాళ్ళతో, ఆమాటా, ఈమాటా మాట్లాడిన తర్వాత ముఖం విచారంగా పెట్టి, ''ఈ మధ్య నా మిత్రుడొకడు చాలా విషాదపరిణామానికి గురి అయ్యాడు. అది మీరిద్దరూ వినదగిన సంగతి!'' అన్నాడు.

తర్వాత మంత్రి సుబుద్ధి, తన మిత్రుణ్ణి గురించి చెప్పిన వివరాలిలా వున్నాయి:

మంత్రి మిత్రుడైన దానశీలి వయోవృద్ధుడు; ఆయనకు కొంతకాలంగా గుండె జబ్బు లాంటిది కూడా వున్నది. ఒకనాటి రాత్రి దానశీలికి ఒక భయంకరమైన కల వచ్చింది. ఆ కలలో ఆయన, ఒక కారడవిలో దారి తప్పిపోయాడు. ఆయన చెట్ల మధ్య పడుతూ లేస్తూ అతి కష్టం మీద ప్రయాణం సాగించి, చివరకు ఒక మైదాన ప్రదేశాన్ని చేరాడు. పైన నక్షత్రాలు మిణుకుమిణుకుమంటున్నవి. ఆ గుడ్డివెలుగులో ఆయనకు నాలుగు దారులు గల, ఒక కూడలి ప్రదేశం కనిపించింది. ఆయన ఆ దారులలో ఒకదాని వెంట నడవసాగాడు. కొంతదూరం వెళ్ళేసరికి, దారే కనిపించనంతగా పొదలూ, చెట్లగుబుళ్ళతో నిండిన ప్రదేశం వచ్చింది. అక్కడ కొన్ని సింహాలు తిరుగుతున్నవి. వాటిలో ఒక సింహం దానశీలిని చూసి భయంకరంగా గర్జిస్తూ, ఆయనకేసి రాసాగింది.

దానశీలి ప్రాణభయంతో వెనుదిరిగి పరిగెత్తి, కొంత సేపటికి కాలిదారుల కూడలికి చేరాడు. సింహం జాడలేదు. ఆయన అలసట తీర్చుకున్నాక, రెండో దారి వెంట నడవసాగాడు. కొంతదూరం వెళ్ళాక ఆయనకు పెద్ద వెలుగు కనిపిం

చింది. దానశీలి ఒక పొదచాటుకు చేరి, ఆ వెలుగు వస్తున్నవైపుకు చూశాడు. ఆ ప్రదేశంలో అనేకమైన పెద్దపెద్ద పుట్టలున్నవి. వాటిపై కాలసర్పాలు పడగలు విప్పి ఆడుతున్నవి. ఆ పడగలపై వున్న మణులు, కాంతులు విరజిమ్ముతూ ప్రకాశిస్తున్నవి.

ఆశ్చర్యంతో. ఆ దృశ్యాన్ని చూస్తున్న దానశీలిని, పుట్టల మధ్య ఆడుతున్న ఐదు తలల మహాసర్పం ఒకటి చూసి, బుసలు కొడుతూ అమితవేగంతో ఆయనకేసి రాసాగింది. ఆయన గిరుక్కున వెనుదిరిగి, శక్తికొలదీ పరిగెత్తి, తిరిగి నాలుగు దారుల కూడలిని చేరాడు. మహాసర్పం జాడలేదు.

ఈసారి దానశీలి మూడవ దారిగుండా నడవసాగాడు. కొంతదూరం వెళ్ళాక, ఆ దారి ఒక కొండదగ్గిర ఆగిపోయింది. ఆ ప్రదేశాన ఆయనకు. కొన్ని మానవ కంకాళాలు కనిపించాయి. కీడును శంకించిన దానశీలి, వెనుదిరిగేలోపలే, దాపుల వున్న గుహలోంచి భయంకరాకారుడైన రాక్షసుడొకడు ముక్కుపుటాలు ఎగరవేస్తూ బయటికి వచ్చాడు. వాణ్ణి చూస్తూనే దానశీలి కెవ్వుమంటూ అరిచి, పరిగెత్తి నాలుగు దారుల కూడలిని చేరాడు.

అయితే, రాక్షసుడు పెద్దగా హుంకరిస్తూ, తనకేసి రావడం చూసిన దానశీలి, వెంటనే అక్కడున్న నాలుగవ దారి వెంట



పరిగెత్తాడు. ఆ దారి అతణ్ణి కొండఅంచుకు చేర్చింది. దానికి దిగువన పెద్ద అగాథ మున్నది. వెనుక రాక్షసుడు; ముందు అగాథం! ప్రాణాలమీద ఆశకోల్పోయిన దానశీలి నిలువెల్లా గజగజ వణికిపోతూ అగాథంలోకి తొంగిచూసేంతలో, కాళ్ళ కింద వున్న రాయి జారింది. ఆయన కెవ్వుమని అరుస్తూ అగాథంలోకి పడిపోయాడు.

మంత్రి ఇలా చెప్పి, ఒక క్షణం ఆగి జయ, విజయులతో, "చూశారా, ఎంత భయంకరమైన కలో! అసలే గుండె జబ్బుతో బాధపడుతున్న, నా మిత్రుడు దానశీలి, కలనుంచి మెలకువ వస్తూనే, గుండెపోటుకు గురిఅయి మరణించాడు," అన్నాడు.

అప్పుడు జయుడు ఎంతో విచారంగా, "స్వప్నంలో కలిగే అనుభూతులకు శరీరం కూడా లోనవుతుందని, మనస్తత్వశాస్త్రం చెబుతున్నది. తమ మిత్రుడు కలలో నాలుగుసార్లు ప్రాణభయానికి లోన య్యాడు. అసలే గుండెజబ్బు మనిషి కనక, ఆ వత్తిడికి తట్టుకోలేక గుండె ఆగిపోయి వుంటుంది. మీ మిత్రుడి మరణానికి, నా ప్రగాఢ సానుభూతిని తెలుపుతున్నాను," అన్నాడు.

మంత్రి తల పంకించి, విజయుడికేసి చూశాడు.

విజయుడు చిరునవ్వు నవ్వుతూ, "క్షమించాలి, మహామంత్రీ! మీరు చెప్పిన దంతా ఒక కట్టుకథ," అన్నాడు.

మంత్రి కోపంగా, "అదెలా కట్టుకథో నిరూపించగలవా?" అని అడిగాడు.

దానికి విజయుడు వినయంగా, "మీ మిత్రుడు మెలుకువ వస్తూనే, గుండె పోటుకు గురై వెంటనే చనిపోయినప్పుడు, ఆయనకు కలవచ్చిన విషయం మీకు తెలిసే అవకాశం లేదుకదా!" అన్నాడు.

మంత్రి సుబుద్ధి, విజయుణ్ణి అభినందించి, అప్పటికప్పుడే అతణ్ణి రాజు వీరవర్మకు అంతరంగిక సలహాదారుగా నియమించాడు.






అనుకున్న ప్రకారం మిగిలిన ద్వారాల ముట్టడి కూడా అదేవిధంగా జరిగింది. సుగ్రీవుడు అవసరాన్నిబట్టి సహాయపడటానికి ఉత్తర, పశ్చిమ ద్వారాల మధ్య పెద్ద సేనతో ఉన్నాడు. వానరులు యుద్ధం చెయ్యటానికి చెట్లూ, రాళ్ళూ, పట్టుకున్నారు. మొత్తం వానరసేన లంకను చుట్టుముట్టుతున్నది. వాళ్ళ మూలాన త్రికూటపర్వతం కనబడటం లేదు. ఇక వాళ్ళ కోలాహలం మాట చెప్పనే అవసరం లేదు.

ఆ తరుణంలో విభీషణుడితో చెప్పి, రాముడు అంగదుణ్ణి రావణుడి వద్దకు రాయబారిగా పంప నిశ్చయించి, అంగదుణ్ణి పిలిపించాడు. అతడు రాగానే రావణుడితో తన మాటగా ఇలా చెప్పమన్నాడు:

"రావణుడా, బ్రహ్మ వల్ల పొందిన వరాల గర్వంతో నువ్వు అనేక పాపాలు చేశావు. నీ గర్వం నశిస్తుంది. నా భార్యను ఎత్తుకు పోయావన్న ఆగ్రహంతో నేను యమధర్మరాజు లాగా వచ్చాను. నిన్ను చంపటానికి లంకాద్వారం వద్ద ఉన్నాను. నువ్వు ఏ బలం చూసుకుని సీతను ఎత్తుకు పోయావో, ఆ బలాన్ని ఇప్పుడు చూపు. సీతను తెచ్చి నా కిచ్చి, నన్ను శరణువేడక పోతే నా క్రూరమైన బాణాలు ఈ లోకంలో రాక్షసులు లేకుండా చేస్తాయి. ధర్మాత్ముడూ, నన్ను శరణుచొచ్చిన వాడూ అయిన విభీషణుణ్ణి లంకకు రాజు చేస్తాను.



నువ్వు ధైర్యంగా యుద్ధం చేస్తే చెయ్యి. అంతేగాని పక్షివై ఎక్కడికన్నా పారిపోదామన్నా అది నేను సాగనివ్వను. నీకు నే నొక మంచి సలహా ఇస్తాను. ఇక నువ్వు లంకను చూడవు. ఇప్పుడే చక్కగా చూసుకో. ఇప్పుడే నీకు నువ్వు ఉత్తర క్రియలు చేసుకో. నీ ప్రాణాలు నా చేతిలో ఉన్నాయి.''

తార కొడుకైన అంగదుడు రాముడిచ్చిన ఈ సందేశం తీసుకుని ఆకాశ మార్గాన అతి శీఘ్రంగా రావణుడి ఇంటికి వెళ్ళి, మంత్రులతో కూర్చుని ఉన్న రావణుణ్ణి చూశాడు. రావణుడూ, అతడి చుట్టూవున్న మంత్రులూ, ప్రశ్నించక ముందే అతను రావణుడికి తన పేరు చెప్పుకుని రాముడి సందేశం వినిపించాడు.

అతి పరుషమైన ఆ సందేశం విని రావణుడికి కోపం వచ్చింది. ఆ కోపంలో అతను కళ్ళెర్రచేసి, '' ఈ దుర్మార్గుణ్ణి వెంటనే పట్టి చంపండి,'' అని మళ్ళీ మళ్ళీ అన్నాడు.

నలుగురు రాక్షసులు ముందుకు వచ్చి అంగదుణ్ణి పట్టుకున్నారు. అంగదుడు కావాలనే వాళ్ళకు పట్టుబడ్డాడు. వాళ్ళు తనను పట్టుకున్న మరుక్షణం అతను వాళ్ళను తన రెండు చేతుల సందున ఇరికించుకుని, ఆకాశంలోకి లేచాడు. అతను ఇంటి శిఖరం మీద వాలి, రావణుడు చూస్తూండగానే రాక్షసులను కింద పడేసి, ఇంటి శిఖరాన్ని విరిచాడు. తరవాత అతను తన పేరు చెప్పుకుని సింహనాదం చేసి, రాముడి వద్దకు తిరిగి వచ్చాడు.

అంగదుడు చేసిన పని రావణుడికి అపశకునం అనిపించింది. అతను ధైర్యాన్ని కోల్పోయి, దిక్కులు చూస్తూ, నిట్టూర్పులు విడిచాడు.

వానరులు యుద్ధం కోసం ఆత్రంగా కాచుకుని ఉన్నారు. పర్వతాకారుడైన సుషేణుడు, సుగ్రీవుడి ఆజ్ఞ చొప్పున, కొందరు వానరవీరులను వెంటబెట్టుకుని

లంక ద్వారాలు నాలుగూ కలయతిరుగు తున్నాడు. నగరం లోపల రాక్షసులు కూడా ఆయుధాలు ధరించి కోలాహలంగా తిరుగుతున్నారు.

కొందరు రాక్షసులు రావణుడి వద్దకు వెళ్ళి, వానరులు లంకను ముట్టడించా రని చెప్పారు.

రావణుడు వెంటనే సింహాసనం మీది నుంచి లేచి తన ఇంటి పైకి వెళ్ళి, లంక చుట్టూ వానర సేనలు ఉండటం చూశాడు. త్రికూటపర్వతం అంతా వానరసేనలతో నిండివున్నది. అంతమంది వానరులను ఎలా చంపాలో అతనికి అంతుబట్టలేదు.



రాముడు కూడా లంకానగర ప్రాకారం వద్దకు వెళ్ళి, నగరాన్ని రాక్షసులు ఎంత బాగా రక్షిస్తున్నదీ చూశాడు. ఆ లంక లోనే కదా సీత చిక్కి ఉన్నదన్న ఆలో చన రాగానే అతనికి దుఃఖమూ, కోపమూ కలిగాయి. అతను వానరులతో, "వెంటనే బయలుదేరి శత్రు సంహారం సాగిం చండి," అన్నాడు.

వానరశ్రేష్ఠులు చెట్లూ, శిలలూ తీసు కుని అందుకు సిద్ధంగానే ఉన్నారు. రాముడు ఇలా అనగానే వానరులు అక్క డక్కడా ప్రాకారం మీదికి ఎగబాకారు. ద్వారాల పైన వానరుల దాడి ఆరంభ మయింది.

విభీషణుడు కవచం ధరించి, తన మంత్రులతో సహా రాముడి సమీపంలోనే ఉన్నాడు. గజుడూ, గవయుడూ, గవా క్షుడూ, శరభుడూ, గంధమాదనుడూ అన్ని చోట్లా తిరుగుతూ వానరసేనను రక్షిస్తున్నారు.

ఈ స్థితిలో రావణుడు తన రాక్షస సేనలను యుద్ధానికి పొమ్మని ఆజ్ఞా పించాడు. వెంటనే రాక్షసులు సింహ నాదాలు చేశారు. భేరీలు మోగాయి. శంఖాలు ఊదారు. ఆవేశపరులై యుద్ధో త్సాహంతో, లంక లోపల రాక్షసులూ, బయట వానరులూ చేసే కోలాహలం మిన్నుముట్టింది.



ఉభయపక్షాలకూ యుద్ధం ఆరంభమయింది. రాక్షసులు గదలతోనూ, శక్తులతోనూ, శూలాలతోనూ, గొడ్డళ్ళతోనూ వానరుల పైకి ఉరికి కొట్టసాగారు. వానరులు రాక్షసుల మీద చెట్లూ, పెద్ద పెద్ద రాళ్ళూ, తమ గోళ్ళూ, కోరలూ ఉపయోగించారు.

కొందరు రాక్షసులు ప్రాకారాల మీది నుంచి వానరుల మీద ఆయుధాలు ప్రయోగించారు.

వానరులు ప్రాకారాల మీదికి ఎగిరి రాక్షసులను కిందపడదోశారు. రాక్షస వానరుల మధ్య అతిభయంకరమైన దొమ్మియుద్ధం జరిగింది.

దొమ్మి యుద్ధంతో బాటు ద్వంద్వ యుద్ధాలు కూడా జరిగాయి. ఇంద్రజిత్తు అంగదుడితోనూ, విభీషణుడి మంత్రులలో ఒకడైన సంపాతి అనేవాడు ప్రజంఘుడనే రాక్షసుడితోనూ, హనుమంతుడు జంబుమాలి తోనూ యుద్ధం చేశారు. అలాగే గజుడికి తపనుడనే రాక్షసుడితోనూ, నీలుడికి నికుంభుడనే రాక్షస వీరుడితోనూ యుద్ధం జరిగింది. సుగ్రీవుడు ప్రఘసుడనే రాక్షసుడితోనూ, లక్ష్మణుడు విరూపాక్షుడితోనూ యుద్ధం చేశారు. ఇలా అనేకమంది వానరవీరులు, రాక్షస వీరులతో భయంకరమైన ద్వంద్వ యుద్ధాలు చేశారు.

ఈ ద్వంద్వ యుద్ధాలలో అంగదుడు ఇంద్రజిత్తు రథాన్నీ, సారథినీ, గుర్రాలనూ నాశనం చేశాడు; సంపాతి ప్రజంఘుణ్ణి చంపాడు; హనుమంతుడు జంబుమాలిని కొట్టాడు; ప్రతపనుడు అనే రాక్షసుడి కళ్ళు నలుడు పీకేశాడు; ప్రఘసుడు సుగ్రీవుడి చేతిలో చచ్చాడు.

నలుగురు రాక్షసులు రాముడి మీద బాణాలు ప్రయోగించారు. రాముడు తన బాణాలతో ఆ నలుగురి తలలూ తెగవేశాడు. మైందుడు వజ్రముష్టి అనేవాణ్ణి పిడికిలితో పొడిచి చంపాడు. సుషేణుడి చేతిలో విద్యున్మాలి చచ్చాడు. మొత్తం



మీద ఇలా జరిగిన ద్వంద్వ యుద్ధాలలో చాలామంది రాక్షసులు వానరుల చేతిలో చచ్చారు.

ఇంతలో సూర్యాస్తమయమై, చీకటి పడింది. కాని యుద్ధం ఆగలేదు. రాక్షసులు యుద్ధభూమి అంతటా తిరుగుతూ, వానరులను భక్షించసాగారు. వానరులు బంగారు నగలనూ, తెల్లగా మెరిసే దంతాలనూబట్టి రాక్షసులను పోల్చి, పట్టి చీల్చారు. ఆ కటిక చీకటిలోనే రామలక్ష్మణులు తమ బాణాలతో అనేకమంది రాక్షసులను చంపారు.

అంగదుడు తన రథాన్నీ, సారథినీ, గుర్రాలనూ నాశనం చేసిన తరవాత ఇంద్రజిత్తు తన మాయ చేత అదృశ్యమైపోయి, ఇప్పుడు రామలక్ష్మణుల మీద నాగాస్త్రాలు ప్రయోగించి, ఆ ఇద్దరినీ బంధించాడు. అతను వాళ్ళతో, "నేను అదృశ్యంగా యుద్ధం చేసేటప్పుడు నన్ను ఇంద్రుడు అయినా ఏమీ చెయ్యలేడు. అల్పులైన మీ రెంత? ఇప్పుడే మీ ప్రాణాలు తీస్తాను," అంటూ సింహనాదం చేశాడు.

బాణాలతో శరీరాలు పూర్తిగా కట్టుబడిపోయిన రామలక్ష్మణులకు ఏమీ కనిపించలేదు. ఇంద్రజిత్తు వేసే బాణాలు వారి వక్షస్థలాలపై తగిలాయి. ఇద్దరూ నేల మీద పడిపోయారు. వారి రక్తం ఏర్లు కట్టి పారింది. రాముడి స్థితి చూసి లక్ష్మణుడికి జీవితం మీద ఆశ పోయింది.

హనుమంతుడు మొదలైన వానర ప్రముఖులు రామలక్ష్మణుల చుట్టూ చేరి దుఃఖించారు. ఇంద్రజిత్తుకోసం వానరులు అనేకులు అన్ని దిక్కులూ వెతికారు. కాని లాభం లేకపోయింది. ఒక్క విభీషణుడే తన మాయతో ఇంద్రజిత్తును చూడగలిగాడు.

ఈ లోపల ఇంద్రజిత్తు రాక్షసులతో ఇలా చెబుతున్నాడు: "చూడండి, రామలక్ష్మణుల పరాక్రమం నా ముందు ఎందుకూ పనికిరాలేదు. వాళ్ళను



నా బాణాలతో బంధించాను. ఈ బంధాల నుంచి వారిని ఎవరూ విడిపించలేరు: వీళ్ళు నా చేతిలో చచ్చారు.''

ఇలా అని, ఇంద్రజిత్తు వానర వీరులను తన బాణాలతో నొప్పించసాగాడు. రాక్షసులు ఇంద్రజిత్తును కొనియాడారు. కదలకుండా పడి ఉన్న రామలక్ష్మణులను చూసి, వాళ్ళు చచ్చిపోయారనుకుని, ఇంద్రజిత్తు లంకానగరంలోకి వెళ్ళిపోయాడు.

సుగ్రీవుడు కూడా రామలక్ష్మణుల శరీరాలను పూర్తిగా కప్పిన బాణాలను చూసి భయపడ్డాడు. అతను ఏడుస్తూండటం చూసి విభీషణుడు, ''సుగ్రీవుడా, భయపడకు, ఏడవకు. యుద్ధం అంటే ఇలాగే ఉంటుంది. అన్నప్పుడల్లా విజయమే కలగదు. రామలక్ష్మణులు మూర్ఛపోయారు. తిరిగి వాళ్ళు స్పృహ తెచ్చుకోవచ్చు,'' అని సుగ్రీవుడి కన్నీరు తుడిచాడు.

లంకకు తిరిగి వెళ్ళిన ఇంద్రజిత్తు తన తండ్రిని కలుసుకుని, ''రామలక్ష్మణులను చంపాను,'' అని చెప్పాడు.

రావణుడు పరమానందంతో ఆసనం నుంచి లేచి తన కొడుకును కౌగలించుకున్నాడు. అతను రామలక్ష్మణుల వధ ఎలా జరిగినదీ కొడుకును అడిగి చెప్పించుకున్నాడు.

తరవాత అతను ఇంద్రజిత్తును పంపేసి సీతకు కాపలి ఉన్న రాక్షస స్త్రీలను పిలిపించాడు. త్రిజట మొదలుగా గల రాక్షస స్త్రీలు వచ్చారు. రావణుడు వాళ్ళతో, ''ఇంద్రజిత్తు రామలక్ష్మణులను చంపాడని సీతతో చెప్పండి. ఆమెను పుష్పక విమానంలో తీసుకుపోయి, చచ్చి పడి ఉన్న రామలక్ష్మణులను చూపండి. ఇక సీత రాముడి మీది ఆశ వదులుకుని, చక్కగా అలంకరించుకుని నన్ను చేరవచ్చు,'' అన్నాడు.

రాక్షస స్త్రీలు పుష్పకవిమానాన్ని తీసుకుని అశోకవనంలో ఉన్న సీత వద్దకు

వెళ్ళి, సీతను త్రిజటతో బాటు అందులో ఎక్కించి, రామలక్ష్మణులను చూపించటానికి తీసుకుపోయారు.

రావణుడు లంకలో జెండా ఎగురవేయించి, అలంకరించటానికి ఉత్తరువిచ్చాడు; ఇంద్రజిత్తు రామలక్ష్మణులను చంపినట్టు చాటింపు వేయించాడు.

సీత రాక్షసులను చూసింది; వాళ్ళు మహా ఆనందంలో ఉన్నారు. వానరులు దుఃఖంలో ఉండటం కూడా ఆమె చూసింది. బాణాలు శరీరమంతా కప్పి, నేల మీద పడి ఉన్న రామలక్ష్మణులను కూడా ఆమె చూసింది. ఆమెకు దుఃఖం ఆగలేదు.

రామలక్ష్మణులు చచ్చిపోయారనుకుని సీత చాలా దుఃఖించింది. ఆమెకు లోగడ జ్యోతిష్కులు తాను పుత్రవతి అవుతుందనీ, తనకు వైధవ్యం లేదనీ, తన భర్త అశ్వమేధ యాగం చేస్తాడనీ, తాను సామ్రాజ్యానికి పట్టమహిషి అవుతుందనీ, ఎందుకంటే ఆమె పాదాలలో పద్మరేఖలున్నాయనీ, ఏమేమో చెప్పారు; అవన్నీ ఇప్పుడు అబద్ధమయ్యాయి!

ఈ విధంగా దుఃఖించే సీతను ఊరడిస్తూ త్రిజట, రామలక్ష్మణులు చావలేదనీ, మూర్ఛలో ఉన్నారనీ చెప్పింది. రాక్షస స్త్రీలు సీతను పుష్పకవిమానంలో అశోకవనానికి తిరిగి తీసుకుపోయారు.

తరవాత రామలక్ష్మణులలో రాముడు ముందు మూర్ఛ నుంచి బయటపడ్డాడు. అయితే అతను ఇంకా బాణ పాశాలకు కట్టుబడే ఉన్నాడు. చచ్చినట్టు పడి ఉన్న లక్ష్మణుణ్ణి చూసి అతను చాలా శోకించాడు. లక్ష్మణుడు చచ్చిపోతే తాను బతికి ఉండటం అసాధ్యమనీ, విభీషణుణ్ణి రాక్షసరాజు చేస్తానన్న మాట నిలబెట్టుకునే అవకాశం తనకు లేకుండా పోయిందనీ, సుగ్రీవుడు మొదలైనవారు వానర సేనలతో కిష్కింధకు వెళ్ళిపోవటం మంచిదనీ రాముడు అన్నాడు. అతను శోకిస్తూంటే, వానర ప్రముఖులంతా అతనితో బాటు శోకించారు.





# న్యాయపాలన

పూర్వం ఒక సుల్తాను తన ప్రజలను ఎంతో న్యాయంగా పాలించేవాడు. తన దేశంలో ఎంతహీనులకు ఎలాటి అన్యాయం జరిగినా వారికి న్యాయం చేకూర్చని దే నిద్రపోయేవాడు కాడు.

ఒకసారి సుల్తాను దర్బారులోకి ఒక మనిషి, చేతిలో సంచీ ఒకటి పట్టుకుని వచ్చి, ఒక పక్కగా నిలబడ్డాడు. సుల్తాను ఆ మనిషిని చూసి, "నీ కేదో కష్టం కలిగి నట్టున్నది. ఏమన్నా చెప్పకోదలిచావా?" అని అడిగాడు.

"ప్రభూ, నేనొక వ్యాపారిని. మీ పరిపాలనలో నాకు తీరని మోసం జరిగింది," అన్నాడు ఆ మనిషి.

"ఏం జరిగిందో చెప్పు. నీకు జరిగిన అన్యాయాన్ని నేను సరిచేస్తాను," అన్నాడు సుల్తాను. వ్యాపారి తనకు జరిగిన మోసం గురించి సుల్తానుకు తెలిపాడు.

ఆ వ్యాపారి ప్రయాణం మీద పోతూ, తన కష్టార్జితమైన రెండువేల అష్రఫీలు ఆ సంచిలో పెట్టి ఆ నగరంలోని కాజీగారి వద్ద ఉంచాడు. దారిలో దొంగలు దోస్తారని వ్యాపారి భయపడి అలా చేశాడు. కాని అతను తిరిగివచ్చి చూస్తే కాజీగారే సంచీలో అష్రఫీలకు బదులు రాగిముక్కలు పెట్టాడు.

"సంచి తిరిగి పుచ్చుకునేటప్పుడు దాన్ని సరిగా చూసుకోలేదా?" అని సుల్తాను వ్యాపారిని అడిగాడు.

"ప్రభూ, ఆ సంచీ నే నిచ్చినదే. నేను ఇంటికి వచ్చి, ముద్ర ఊడదీసి చూసేదాకా అందులో డబ్బు పోయిందనీ, దానికి మారుగా రాగిముక్కలు వచ్చాయనీ తెలియలేదు," అన్నాడు వ్యాపారి.

"సంచీలో కంతలు గాని, చిరుగులు గాని ఉన్నాయేమో ముందుగా చూసుకున్నావా?" అని సుల్తాను మళ్ళీ అడిగాడు.

అరేబియా జానపద కథ

''అలాటి వేమీ లేవు. వేసిన ముద్ర వేసినట్టే ఉన్నది కూడా! అందులో డబ్బు లేదనుకోవటానికి ఎలాటి కారణమూ లేక పోయింది,'' అన్నాడు వ్యాపారి.

సుల్తాను కొంతసేపుదీర్ఘంగాఆలోచించి, వ్యాపారితో, ''సరే, ఈ సంచీ ఇక్కడే ఉంచి నువ్వు ఇప్పుడు వెళ్ళిపో. నువ్వు చెప్పినది నిజమైతే నీకు తప్పక న్యాయం జరుగుతుంది. కాని, నువ్వు అబద్ధం చెప్పి ఉంటే నీ ప్రాణాలు దక్కవు,'' అన్నాడు.

దర్బారు ముగిసింది. సుల్తాను ఇంటికి వెళ్ళి కూడా వ్యాపారి చేసిన ఫిర్యాదు గురించే ఆలోచిస్తున్నాడు. ముద్ర ముద్ర గానే ఉండగా సంచీలోని బంగారం ఎలా పోయింది ?

ఈ ప్రశ్నకు సమాధానం తెలుసుకునే మార్గం సుల్తానుకు అకస్మాత్తుగా తట్టింది. వెంటనే ఆయన దర్బారు భవనానికి తిరిగి వెళ్ళి, తన సింహాసనంపై పరచి ఉన్న అమూల్యమైన రత్నకంబళాన్ని వేళ్ళతో అక్కడక్కడా చించి, తన ఇంటికి తిరిగి వచ్చేశాడు.

మర్నాడు ఉదయంసుల్తానుతనగుర్రం మీద వేటకు వెళ్ళినసమయంలో,దర్బారు భవనం ఊడ్చే నౌకరు వచ్చి, సింహాసనం మీద ఉండే రత్నకంబళం అక్కడక్కడా చిరిగి ఉండటం చూసి కంగారుపడ్డాడు. వాడు వెళ్ళి రాజభవనంలో ఉండే సర్దారును పిలుచుకువచ్చి రత్నకంబళాన్ని చూపించాడు.



సర్దారు నౌకరుతో, "భయపడకు. దీన్ని సరి చెయ్యవచ్చు. నగరంలో మహమ్మద్ అనే తెలివైన దర్జీ ఉన్నాడు. వాణ్ణి పిలుచుకురా. వాడు చిరుగు ఎక్కడ అయినదీ తెలియరాకుండా రత్నకంబళాన్ని మరమ్మతు చెయ్యగలడు. వెంటనే పోయిరా," అన్నాడు.

నౌకరు మహమ్మద్ ఇంటికి వెళ్ళి విషయం చెప్పి, "సింహాసనం మీది రత్నకంబళం చిరిగినట్టు సుల్తానుగారికి తెలిస్తే నా పీక తెగిపోతుంది," అన్నాడు.

"నీ ప్రాణానికేమీ భయం లేదు. రెండు అష్రఫీలు ఇచ్చుకున్నావంటే ఆ రత్నకంబళాన్ని కుట్టుతెలియకుండా మరమ్మతు చేసేస్తాను," అన్నాడు దర్జీవాడు.

నౌకరు డబ్బు తీసి దర్జీవాడి చేతిలో పెట్టి, వాణ్ణి వెంట బెట్టుకుని దర్బారు భవనానికి వచ్చాడు. మహమ్మద్ తెలివితేటలు ఎలాటివో గాని, వాడి మరమ్మతు పూర్తి అయేసరికి రత్నకంబళం మునుపు ఉండినట్టుగానే తయారయింది. దర్బారు భవనం ఊడ్చే నౌకరు ప్రాణాలు కుదటపడ్డాయి.

సూర్యాస్తమయం వేళకు సుల్తానుసపరివారంగా వేట నుంచి తిరిగి వచ్చి, గుర్రం మీది నుంచి దిగుతూనే తిన్నగా దర్బారు భవనానికి వెళ్ళాడు. ఆయన తన సింహాసనం మీది రత్నకంబళం మామూలుగా ఉండటం గమనించాడు. ఆయన ఊహించినట్టే దానిమీద చిరుగుల జాడ ఏమాత్రమూ



లేదు. భవనం ఊడ్చే నౌకరును పిలిపించి ఆయన, "ఈ రత్నకంబళం చిరిగిపోయి వుండాలే?" అన్నాడు.

నౌకరు కంగారు పడుతూ, "లేదు, ప్రభూ, సరిగానే ఉన్నది." అన్నాడు.

"అబద్ధమాడతావా, దొంగ వెధవా? నేనే ఆ కంబళాన్ని స్వయంగా చింపాను. నిజం చెప్పు, దీన్ని మరమ్మతు చేసినది ఎవరు?" అన్నాడు సుల్తాను మండిపడుతూ.

నౌకరు వణికిపోతూ మహమ్మద్ చేసిన మరమ్మతు గురించి బయటపెట్టాడు.

సుల్తాను మహమ్మద్‌ను రప్పించి, వాడికి వ్యాపారి తాలూకు సంచీని చూపి, "ఈ సంచీని ఎప్పుడన్నా చూశావా?" అని అడిగాడు.

మహమ్మద్ సంచీని అటూ ఇటూ తిప్పి చూసి, "చూశాను, ప్రభూ! మన నగరంలో ఉండే కాజీగారు నా చేత దీన్ని మరమ్మతు చేయించారు," అన్నాడు.

సుల్తాను దర్జీవాణ్ణి పంపేసి, కాజీని పిలిపించి, "ఇలాంటి అవమానకరమైన పనులు చెయ్యటానికి నీకు సిగ్గులేదా? నువ్వు అవమానంపాలు కావటమే గాక, నా కీర్తినీ, దేశప్రతిష్ఠనూ కూడా మంటగలిపావే!" అన్నాడు.

"ప్రభూ, నే నెన్నడూ అలాటి పనులు చెయ్యను. గిట్టనివాళ్ళు ఎవరో నన్ను గురించితమకుఅబద్ధాలుచెప్పి ఉంటారు," అన్నాడు కాజీ.

"నోరుముయ్యి, నీచుడా! ఇదేమిటి?" అంటూ సుల్తాను తన చేతిలో ఉన్న సంచీని కాజీ ముఖాన విసిరికొట్టాడు.

కాజీకి తాను వ్యాపారికి చేసిన ద్రోహం గుర్తుకు వచ్చి, సుల్తానుకు క్షమాపణ చెప్పుకోబోయాడు.

కాని సుల్తాను ఆ క్షమాపణలను స్వీకరించక కాజీని ఖైదు చేయించాడు. ఆయన మర్నాడు వ్యాపారిని పిలిపించి, అతనికి రావలసిన రెండువేల అష్రఫీలకు మరి మూడువేలు చేర్చి ఇస్తూ, "పెద్ద హోదాలో ఉన్న ఒక మోసకారిని పట్టి ఇచ్చినందుకు నీకు ఈనాం ఇస్తున్నాను," అన్నాడు.





# పెట్టమారి మగడు

రామదుర్గం అనే ఊళ్ళో కాంతమ్మ అనే ఇల్లాలుకు, పొరుగునే కాపురం వుంటున్న తన ఆడపడుచు సీతమ్మతో తరుచు ఏదో తగాదా వస్తూండేది. కాంతమ్మ నోటికి జడిసి చుట్టుపక్కలవాళ్ళెవరూ, వాళ్ళ గొడవల్లో కలగజేసుకోవడానికి ముందుకు వచ్చేవారు కాదు. కాంతమ్మ భర్త శరభ లింగం ఇదంతా చూస్తూ కూడా ఏదీ పట్టనట్టుండేవాడు.

ఒక రోజు సీతమ్మ పెంపుడు పిల్లి కాంతమ్మ ఇంట్లో జొరబడి గిన్నెలో వున్న పాలన్నీ తాగేసింది. కాంతమ్మ పిల్లినీ, సీతమ్మనూ కలిపి శాపనార్థాలు పెట్టడం ప్రారంభించింది.

సీతమ్మ చాలా కోపంగా, "కావలిస్తే నీకు రెండు గిన్నెల పాలు ఇస్తాను. అంతే కానీ నా పిల్లిని మాత్రం ఏమీ తిట్టవద్దు," అన్నది.

ఇందుకు కాంతమ్మ, "ముందు నువ్వా పిల్లిని ఊరిచివరి అడవిలో ఒదిలిపెట్టించకపోతే, నేను ఊరుకునేదిలేదు," అన్నది.

సీతమ్మ విసురుగా, "అది జరిగేపని కాదు!" అన్నది.

ఇలా తగువు ముదిరి ఇద్దరూ పెద్దగా ఒకరిమీద ఇంకొకరు కేకలు వేసుకోవడం మొదలుపెట్టారు.

అప్పుడే పొలం వెళ్దామని బయులుదేరుతున్న శరభలింగం వాళ్ళ కేకలు విని, "తెల్లవారిందనగానే ఏమిటీ వెధవ గొడవ?" అని చెల్లెలు సీతమ్మనే మందలించబోయాడు.

సీతమ్మ రుసరుసలాడుతూ, "పెట్టమారి మగడివి! నువ్వా నన్ను మందలించ చూస్తున్నది," అంటూ ఎదురు సమాధానం చెప్పింది.

కమలిని



చెప్పి, సీతమ్మ చేత తనకు క్షమార్పణ చెప్పించమని అడిగింది.

చిన్నప్పటి నుంచీ సీతమ్మనూ, కాంతమ్మనూ ఎరిగున్న గ్రామపెద్ద, "ఈరాద్ధాంతమంతా చూసిన వాళ్ళెవరైనా వున్నారా?" అని కాంతమ్మను అడిగాడు.

"లేకేం! మా తమ్ముడు కనకరాజు, నా చెల్లెలి మొగుడు అమ్మిరాజు అక్కడే వున్నారు." అన్నది కాంతమ్మ.

గ్రామపెద్ద వాళ్ళిద్దరినీ పిలుచుకు రమ్మని కాంతమ్మకు చెప్పి, నౌకరుతో సీతమ్మకు కబురు పెట్టాడు.

అందరూ వచ్చాక గ్రామపెద్ద, ముందుగా కాంతమ్మ తమ్ముడు కనకరాజును, "సీతమ్మ, మీ బావ శరభలింగాన్ని పెట్టమారి మగడని అనడం నువ్వు విన్నావా?" అని అడిగాడు.

"ఆ మాట ముమ్మారుగా అన్నది. మా బావ దృఢమైన మనిషి. మొన్న ఎవడో దొంగ పెరటిగోడ దూకి దొడ్లో ప్రవేశిస్తే, వాడిని రెండు చేతులతో ఎత్తి వీధిలోకి గిరవాటు వేశాడు. పోనీ మెతక మనిషి అనుకుందామన్నా, ఇచ్చిన బాకీలు వసూలు చేసేటప్పుడు, బాకీదార్లతో చాలా కరకుగా వుంటూ, వాళ్ళని ఎలా అదరగొడుతూంటాడో ఊళ్ళో అందరికీ తెలిసిన సంగతే.. ఇవన్నీ పెట్టమారి

శరభలింగం బిత్తరపోయి మారు మాట్లాడకుండా పొలానికి వెళ్ళిపోయాడు.

కాంతమ్మ రెచ్చిపోతూ, "చెట్టంత అన్నగారిని పట్టుకుని పెట్టమారి అన్నావంటే, నీకెంత పొగరున్నదో తెలుస్తూనే వున్నది. ఊరి పెద్దల ముందు నీచేత నాకు క్షమాపణ చెప్పించుకోకపోతే, నా పేరు కాంతమ్మే కాదు!" అంటూ సవాలు చేసింది.

"నేనన్నది వున్నమాట! ఊరి పెద్దలు వేరే చెప్పేదేముందో చూస్తానుగా," అంటూ సీతమ్మ బదులు చెప్పింది.

కాంతమ్మ తిన్నగా గ్రామపెద్ద ఇంటికి వెళ్ళి, ఆయనకు జరిగిన గొడవంతా

లక్షణాలా?'' అని కనకరాజు ఎదురు ప్రశ్న వేశాడు.

గ్రామపెద్ద నవ్వి, అమ్మిరాజును నువ్వేమంటావని అడిగాడు.

''మా తోడల్లుడు పొలాల్లో పాలేళ్ళ మీద పెత్తనంచేస్తూ పనిచేయడం చూసిన వాళ్ళెవరైనా, ఆయన్ని ఇలా చులకన చెయ్యడానికి సాహసించరు!'' అన్నాడు అమ్మిరాజు.

అంతా విని గ్రామపెద్ద, సీతమ్మతో, ''వీళ్ళంతా చెప్పింది విన్నావు కదా? అన్నగారని ఏమాత్రం సంశయించకుండా శరభలింగాన్ని అలా చిన్నబుచ్చేలాగా మాట్లాడడం బావున్నదా?'' అన్నాడు.

అందుకు సీతమ్మ ఏమాత్రం తొణక్కుండా, ''మా అన్న దృఢమైనవాడే! బాకీదార్లతో కరకుగా వుంటూ వాళ్ళను అదిలించి, బెదిరించి ఇచ్చిన అప్పులు అణాపైసలతో సహా వసూలు చేస్తున్న వ్యవహర్త అని కూడా తెలుసు. అతడు ఇతర్లమీద పెత్తనం చెలాయించడంలో మంచి నేర్పున్నవాడు. కాని, ఈ ప్రతిభా పరాక్రమాలన్నీ, మా వదిన కనుచూపు మేరలో ఎక్కడా లేనప్పుడే!'' అన్నది.

గ్రామపెద్ద ఈ తగువు ఎలా తీరుస్తాడో చూద్దామని, ఆ పక్కనే నిలబడి అంతా గమనిస్తున్న గ్రామ నౌకర్లిద్దరు సీతమ్మ అన్న మాటలకు పెద్దగా నవ్వుతూంటే, గ్రామపెద్ద కూడా ఒకసారి నవ్వి, ''పెట్టమారి మగడు అన్న మాటకు ఇంత అర్థం వున్నదని, నాకిప్పుడే తెలిసింది,'' అన్నాడు.

ఆ తర్వాత ఆయన కాంతమ్మనూ, సీతమ్మనూ వేరువేరుగా పిలిచి, ''మీ ఇద్దరి గొడవా వినేందుకు గ్రామస్థులు చుట్టూ చేరకపోవడం మేలే అయింది. ఇంటిగుట్టు ఇలా రచ్చకెక్కించుకుని తగువులాడుతూంటే, నవ్వులపాలయ్యేది మీరే. ఇకముందయినా మీరిద్దరూ కలహం పెంచుకోకుండా సఖ్యంగా వుండడం ఎంతో అవసరం!'' అని హితబోధచేసి పంపేశాడు.





# నచ్చిన బంటు

ఒక ఊళ్ళో దామూ, సోమూ అని ఇద్దరు స్నేహితులుండేవాళ్ళు. ఇద్దరూ పేదవాళ్ళే కావటం చేత చిల్లర పనులు చేసుకుని జీవితంగడుపుతూ ఉండేవాళ్లు. ఇందువల్ల వాళ్లకు సరిగా జరుగుబాటు అయ్యేది కాదు. అందుచేత వాళ్ళు కుదురుగా ఎక్కడన్నా నౌకరీ దొరుకుతుందేమోనని వెతకసాగారు.

పక్క గ్రామంలో ఉన్న జమీందారు గారింట నౌకరీ దొరుకుతుందని వాళ్ళకు తెలిసింది.

ఇద్దరు స్నేహితులూ ఒకరోజు తెల్లవారు ఝామునే లేచి జమీందారుగారి ఇంటికి వెళ్ళారు. వాళ్ళు పని కోసం వచ్చారని జమీందారుగారి మనిషి జమీందారుతో చెప్పాడు. జమీందారు వాళ్ళను చూడ లేదు. లోపలికి రమ్మనలేదు, సోమవారం నాడు ఉదయం వాళ్ళిద్దరినీ కనపడమని మనిషి ద్వారా కబురు చేశాడు.

ఇద్దరూ కాళ్ళీడ్చుకుంటూ వచ్చినదారి పట్టారు. ''మాట్లాడేదేదో ఇప్పుడే మాట్లాడక, మళ్ళీ సోమవారం నాడు రమ్మనట మేమిటి?'' అని సోము విసుక్కున్నాడు.

సోమవారం ఉదయం పెందలాడే నిద్ర లేచి దాము, సోము కోసం వెళ్ళాడు. సోము ముసుగుతన్ని ఇంకా నిద్రపోతున్నాడు. ''జమీందారు ఇంటికి పోదామా ?'' అని దాము అడిగితే, ''తరవాత పోదాంలే. ఏం తొందర ?'' అని గొణిగాడు.

''నేనుపోతున్నాను. కావాలంటే నువ్వు రా !'' అంటూ దాము బయలుదేరాడు. జమీందారు పొద్దున్నే రమ్మంటే పొద్దెక్క పోవటంబాగుండదని అతనుఅనుకున్నాడు.

దాము బయలుదేరిన ఒక గంటకు సోము నిద్ర లేచి, తాపీగా తాను కూడా జమీందారుఇంటికిబయలుదేరాడు. జమీందారు వెళ్లగానే దర్శనంఇస్తాడన్న నమ్మకం

ఏమీ లేదు. అలాంటప్పుడు తాము ఊరు తెల్లవారకుండానే బయలుదేరటం దేనికో సోముకు అర్థం కాలేదు.

దాము రాగానే జమీందారు నౌకరు జమీందారుతో అతని రాకగురించిచెప్పాడు.

''రెండోవాడెందుకు రాలేదో కనుక్కో,'' అని జమీందారు తన నౌకర్ని పంపాడు.

"కొంచెం ఆలస్యంగా వస్తానన్నాడు," అని దాము నౌకరుకుసమాధానంచెప్పాడు.

''వేచి ఉండమను,'' అని జమీందారు తననౌకరుద్వారాదాముకు కబురు చేశాడు.

మరి కొంత సేపటికి సోము కూడా వచ్చి, ''నేను చెప్పలేదా? నా కన్న ముందు వచ్చి ఏమి బావుకున్నావు?'' అని దామును అడిగాడు.

మరి కొంత సేపటికి జమీందారు వచ్చి, ''పని కోసం వచ్చినవాళ్ళు మీరేనా? ఇప్పుడు వెళ్ళిపోయి, బుధవారం ఉదయం కనిపించండి,'' అన్నాడు.

ఇద్దరూ మరొకసారి ఇంటిదారి పట్టారు.

''మనని ఈ జమీందారు నిష్కారణంగా శ్రమ పెడుతున్నాడు. బుధవారం నాడు వచ్చినా ఇదే జరుగుతుంది. ఆ రోజు రావటం వృథా,'' అన్నాడు సోము.

''పని కావలసినవాళ్ళం. ఖాళీగానే ఉన్నాం. ఎన్నిసార్లు తిరిగితే మాత్రం మన కేమి నష్టం?'' అన్నాడు దాము.



బుధవారం ఉదయం కూడా దాము ఒక్కడే జమీందారు ఇంటికి వెళ్ళాడు. సోము మధ్యాన్నం వేళ బయలుదేరాడు.

ఉదయం వచ్చిన దామును జమీందారు మధ్యాన్నం వేళ చూశాడు. ఆయన దాముకు ఇంత అన్నం పెట్టించి, ''రేపు సాయంత్రం కనపడు,'' అని పంపేశాడు.

దాము ఇంటికి తిరిగి వస్తుండగా అతనికి సోము ఎదురయ్యాడు. సోముతో దాము జరిగినది చెప్పాడు.

''నాకు ముందే తెలుసురా. బిచ్చగాడికి వేసినట్టు ఒక కబళం వేసి పంపించాడన్న మాట. ఈ భాగ్యానికి రేపు సాయంకాలం మళ్ళీ వెళ్ళాలా?'' అన్నాడు సోము.

''వెళితే తప్పేం? నిన్ను కూడా రమ్మ న్నాడు. పనికావలసినవాళ్లంరమ్మన్నప్పుడు వెళ్ళకపోతే ఎలా?'' అన్నాడు దాము.

"రేపుసాయంకాలంఆఖరుసారివస్తాను. మళ్ళీ రమ్మంటే రాను,'' అన్నాడు సోము.

ఆ మర్నాడు సాయంకాలం ఇద్దరూ కలిసే జమీందారుగారింటికి వెళ్లారు. జమీందారు సేవకుడు జమీందారుతో మాట్లాడి వచ్చి, ''మీ పని విషయం రేపు ఉదయం మాట్లాడతార్ట. ఈ రాత్రికి మిమ్మల్ని ఇక్కడే ఉండమన్నారు,'' అని చెప్పాడు.

సోముకు కోపం వచ్చింది. అతను జమీందారు నౌకరుతో, ''పనిలేదు పొమ్మని అప్పుడే చెప్పగూడదూ ?'' అని, ''రారా, దామూ !'' అంటూ ఇంటిదారి పట్టాడు.

జమీందారుగారి సేవకుడు లోపలికి పోయి తిరిగి వచ్చి, ఒంటరిగా నిలబడి ఉన్న దామును చూసి, ''నువ్వు ఉంటు న్నావు గదా ? ఇది తీసుకుని బట్టల దుకా ణానికి వెళ్ళి, ఒక జమఖానా, ఒక దుప్పటీ కొనుక్కురమ్మని జమీందారు గారు చెప్పమన్నారు,'' అంటూ అతనికి అయిదు రూపాయలు ఇచ్చాడు.

దాము ఆ రెండు వస్తువులూ కొని, చిల్లర డబ్బులు తెచ్చి జమీందారు కిచ్చాడు. ఆ వస్తువులను జమీందారు తెమ్మన్నది తన కోసమేనని దాముకు తెలిసింది. ఆ రాత్రి జమీందారుగారు పెట్టించిన భోజనమే తిని, జమఖానా పరుచుకుని, దుప్పటి కప్పుకుని దాము నిద్రపోయాడు.

మర్నాడు ఉదయం జమీందారు దామూతో, ''నువ్వు నాకు నచ్చావు. సోమ వారం నుంచీ నువ్వు పనిలో ఉన్నట్టే లెక్క. నీకు నెలకు ముప్పై రూపాయల జీతమిస్తాను. నీ పని ఏమిటంటే, మా జమీందారీకి చెందిన గ్రామాలకు పోయి, మాకు రావలిసిన దస్తు వసూలు చేసుకు రావాలి. అది ఎంతో ఓపికతో చెయ్య వలసిన పని. పని బాగా చేశావంటే నీ జీతం క్రమంగా పెంచుతాను,'' అన్నాడు.

దాముకు పని దొరికినందుకు, సోము తన తొందరపాటుకు చాలా చింతించాడు.





### అరువు తెచ్చుకున్న రంగు!

ఫ్లామింగోస్ అనే ఒక రకం కొంగలు లేత ఎరుపు రంగులో చాలా అందంగా కనిపిస్తాయి. అయితే వాటి అసలు రంగు లేత ఎరుపు కాదు. ఆ కొంగలు అతి చిన్న నీలి పచ్చ రంగు పురుగులను పట్టి తింటాయి. అవి జీర్ణమయ్యేప్పుడు ఎర్రగా మారుతాయి. వాటి కారణంగానే ఈ కొంగల శరీరం లేతఎరుపు రంగులో కనిపిస్తుంది. అంటే అది తీసుకునే ఆహారమే దాని శరీర వర్ణాన్ని నిర్ణయిస్తుంది।

## ప్రకృతి వింతలు:

### జిరాఫీ

4-5 అంగుళాల పొడవుగల చిట్టెలుకకు 7 వెన్నుపూసలుంటాయి. జిరాఫీ మెడ పొడవు 7 అడుగులు. అలా అని దానికి ఎక్కువ వెన్నుపూసలుంటాయా అంటే అదేం కాదు. ఏడు వెన్నుపూసలే వున్నాయి. జిరాఫీ నాలుక పొడవు 18 అంగుళాలు. మనుషుల నాలుక సాధారణంగా 3 అంగుళాలకు మించి వుండదు. జిరాఫీ మామూలు గుర్రాలకన్నా ఎక్కువ వేగంతో పరిగెత్తగలదు. అది పరిగెత్తేప్పుడు ఎలాంటి చప్పుడూ రాదు.





### చిరాయువు గలిగిన చెట్టు!

పదిహేనవ శతాబ్దారంభంలో ఫ్రాన్స్‌కు తీసుకుపోబడిన ఒక నారింజచెట్టును 'కాన్‌స్టబుల్ ట్రీ' అని పిలుస్తారు. 470 సంవత్సరాలకు పైగా ఇది ఫలాలను ఇచ్చింది. మామూలుగా నారింజచెట్టు వంద సంవత్సరాలు జీవిస్తుంది.

25 సంవత్సరాలకు పైగా
సినీ పరిశ్రమకు
ప్రేక్షక పాఠకులకు మధ్య వారధిగా
నిలిచి, ఇటు పరిశ్రమలోనూ
అటు ప్రేక్షకులలోనూ
ఉత్తమాభిరుచులను
పెంపొందించడంలో
కృషిచేస్తున్న

ఏకైక మాసపత్రిక

# విజయచిత్ర





## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1992 జూన్ నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



M. Natarajan

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ ఏప్రిల్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/—లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: — చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ఎవరీ బాల వీరుడు ?

రెండవ ఫోటో: తల్లినే అడించు తనయుడు!

పంపినవారు: బొబ్బా సత్యనారాయణ, టీచర్, శ్రీమాధవ విద్యానికేతన్ హైస్కూల్
నవీపేట, నిజామాబాద్ జిల్లా—503 245 (ఆం. ప్ర)

బహుమతి మొత్తం రు. 50/— నెలాఖరులోగా పంపబడుతుంది.

చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 48-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

మీరు చదువుతున్నారా?

# వనిత



అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో

ఉదయించి పదిహేడు సంవత్సరాలుగా



మన వనితల వికాసానికి తోడ్పడుతున్న

ఏకైక పత్రిక **వనిత**

నెలతల ప్రియ నెచ్చెలి

వనిత

• విజ్ఞానానికి • వికాసానికి • వినోదానికి

